# కాశోజి శతజయంతి సంవత్సరం



జననం: 09.09.1914 మరణం: 13.11.2002

PRSUMORA154

సాహిత్య ప్రస్థానం అక్టోబర్ 2013

సంపుటి : 12 సంచిక : 10

## మోడీ 'కరణం'

కార్పోరేట్ కనుసన్నల్లో సాగే మీడియా గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్రమోడీని దేశానికి ఆదర్శంగా ప్రచారార్భాటం సాగిస్తున్నది. ఆ వూపులోనే తెలుగునాట కొన్ని రాజకీయ శక్తులు కూడా ఆయన సరసన స్థానం సంపాదించాలని ఆశపడుతున్నాయి. తెలుగు సాహిత్య సంస్థల్లో నెలకొన్న ఒక విధమైన స్తబ్దతను కొంతైనా తొలగిస్తూ సాహితీస్రవంతి రంగప్రవేశం చేసిన తొలిదశలో దేశమంతటినీ కలవరపరచిన దురంతం గుజరాత్ నరమేధం. అప్పుడు చాలా చోట్ల దానిపై జనకవనాలు గుజరాత్ గాయం పేరిట సాహితీ మిత్రుల బృహత్ సమీకరణ, సంకలనం ప్రచురణా, కల్లోలిత ప్రాంతాల సందర్శన వంటివన్నీ జరిగాయి. కాలం ఎంత విచిత్రమైందీ విపరీతమైందీ చెప్పాలంటే ఇప్పుడు మోడీనే ఆశాజ్యోతిగా మీడియా చిత్రిస్తుంటే కార్పోరేట్ జగతి నీరాజనాలర్పిస్తున్నది. ఎవరి రాజకీయాలు ఎలా వున్నా ప్రజాస్వామ్య లౌకిక విలువల విషయంలో మాత్రం ఎలాటి మినహాయింపులకూ ఆస్కారమివ్వని సాహితీస్రవంతి మోడీకరణలో మాయాజాలాన్ని సూటిగానే గుర్తిస్తున్నది. భిన్నమతాలు జాతులతో కూడిన ఈ దేశంలో హిందూత్వ పేరిట హింసానలం రగిలించే శక్తులను గట్టిగా ఎదుర్కొంటుంది. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత యు.ఆర్. అనంతమూర్తి నుంచి సుప్రసిద్ధ ఆర్థిక వేత్తలు అమర్త్యసేన్, అమితవ ఘోష్ వరకూ ఇదే భావం వెలిబుచ్చడం గమనించదగ్గది.

.......

ఆనాడు అలాటి మరో అంశం ఇరాక్‌పై అమెరికా దురాక్రమణ. దానిపైనా అభ్యుదయ శక్తులు శాంతి కాముకులు అనేక విధాల నిరసన తెలిపారు. ఇప్పుడు ఆ పరిస్థితి సిరియా ముంగిట పొంచి కూచుంది. అమెరికా సామ్రాజ్యవాదం రకరకాల సాకులతో సిరియాపై విరుచుకుపడాలని పొంచి కూచుంది. ఈ దుస్తంత్రాన్ని ఆధిపత్య వ్యూహాన్ని తీవ్రంగా ఖండించే బదులు మన ప్రభుత్వం నీళ్లు నములుతున్నది. ఇలా ఒకో దేశంపైనా దురాక్రమణలను అనుమతిస్తే రేపు మనకూ రక్షణ హుళక్కే.

బొమ్మలు : టి. శివాజి, జె. వెంకటేష్, వి. రమేష్, జి. సోము

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొరప్రసాద్
వల్లభాపురం జనార్దన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,

ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# పరివేదన

- జీవన్

మహారాష్ట్ర సమాజంలో ప్రత్యేకించి గ్రామీణ సమూహాల్లో తరతరాలుగా ప్రోది చేయబడ్డ మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా, ప్రజల్లో శాస్త్రీయ అవగాహనను వ్యాపింప చేయడానికి గత రెండు దశాబ్దాలుగా అలుపెరుగని శాంతియుత పోరాటం చేస్తూ వచ్చారు. డా॥ నరేంద్ర దభోల్కర్. ఆయన ఓ అసాధారణ మానవతావాది. అక్కడి మత ఛాందసులు ఆయనపై హిందూ మత వ్యతిరేకి అనే ముద్రవేసి పూనే సమీపంలో ఇటీవల హత్య చేశారు. తన లక్ష్యం కోసం నిబద్ధతతో కృషి చేసిన హేతువాదీ మానవతా వాది అయిన ఆయనను స్మరించుకొంటూ..

మన్నించండి డాక్టర్,
క్షమార్హులం కాము మేము
కుళ్ళిన భూస్వామ్య విలువల్తో
నయాపెట్టుబడిదారీ తనం కంపుగొడుతూనే వుంది
ఫ్యూడల్ దొరతనం
భూమిని చాపగా చుట్టేసి
రియలెస్టేట్ బూం బూం మాయా బజారులో
నయా సంపన్న వర్గంగా పెరిగి
లంపెన్ పెట్టుబడి దారీ వికృత శిశువుగా అవతరించింది

క్షమించండి డాక్టర్,
మిమ్మల్ని మేం అర్థం చేసుకోలేనందుకు
మీవేవీ గొంతెమ్మ కోర్కెలుకావని
గుర్తించ నిరాకరించినందుకు
మతానికీ మత మౌఢ్యానికీ తేడా తెలుసుకోలేనందుకు
విశ్వాసాల్ని మూఢ విశ్వాసాల్తో మిళితం చేస్తున్నందుకు
దశాబ్దాలుగా అలుపెరుగని మీ పోరాట పటిమను
అంచనా వేసుకోలేనందుకు

విషజ్వరాలు వణికిస్తేనో
సమూహాలు సమూహాలకే
మాయదారి అమ్మోరు పోస్తేనో
మలేరియా డయారాలు
గూడేలకు గూడేలనే కబళిస్తుంటేనో
పౌష్టికాహార లేమితో
కాలేయ వ్యాధులు విజృంభిస్తుంటేనో
ఆకలి హాహాకారాలతో జనం అల్లాడుతుంటేనో

గాలిసోకిందనో
చేతబడి జరిగిందనో
భూత పిశాచాలు ఆగ్రహించాయనో
తాంత్రికుడినో మాంత్రికుడినో
దొంగ సన్నాసులనో జులాయి బాబాలనో ఆశ్రయించే
మధ్యయుగాల చిమ్మ చీకటులిచట
ప్రబలంగానూ పదిలంగానూ
పరిఢవిల్లుతునే వున్నయ్

వైద్యం కరువైన చోట
తాయెత్తే దిక్కవుతుంది
వైద్యుడు లేనిచోట
భూతవైద్యుడు అపర ధన్వంతరి అవతారమెత్తుతాడు
అవిద్య అజ్ఞానం తాండవించే చోట
మాయదారి రోగాలు కరాళ నృత్యం చేస్తూనే వుంటాయ్

పేరుకపోయిన కంకాళాల గుట్టలపై
కాలయముడు వికటాట్టహాసం చేస్తూనే వుంటాడు
చావూ బతుకుల నడుమ సరళరేఖ
బిందు ప్రమాణంగానే మిగిలిపోతుంది



నిజం, డా॥ నరేంద్ర దభోల్కర్
సరిగ్గా ఇట్లాంటి సంక్లిష్ట సందర్భంలోనే
నువు రంగ ప్రవేశం చేశావ్
ఆచరణకు ఆమడ దూరంలో నిలిచే
మిథ్యా విలువల మేధో వర్గానికి
దూర దూరంగా జరుగుతూ
వర్తమాన సామాజిక వాస్తవికతకు చేరువవుతూ వచ్చావ్
విజ్ఞాన సుప్రభాతాలు పాట మరిచినదే
అచేత నత్వపు అంధకారం తొలగిపోదని
నిశ్చయంగా నిర్భయంగా ముందుకు సాగావ్

క్షమించండి డాక్టర్,
గ్రహాంతర యానం చేసే మనిషి
అధఃపాతాళానికి కూరుకపోతున్నందుకు
ముహూర్త బలంతోనే
కక్ష్యలోకి ఉపగ్రహాలు
సవ్యంగా ప్రవేశిస్తాయని నమ్ముతున్నందుకు

పూజాదికాలు సక్రుత్తుగా నిర్వహిస్తేనే
శాస్త్రీయ పరిశోధనలు
విజయ తీరాలకు చేరుతాయని విశ్వసిస్తున్నందుకు
సమస్త మూఢవిశ్వాసాలూ
మత విశ్వాసాలుగా బహిరంగంగా ఊరేగుతున్నందుకు
మత దురహంకారం / విషయం పూసిన విచ్చుకత్తిలా స్వైరవిహారం చేస్తున్నందుకు

రాజకీయాన్ని
మతం కలుషితం చేస్తున్నందుకు
మత రాజకీయాలు
అధికారపు నిచ్చెన మెట్లెక్కినందుకు
రక్తపుటేరులు సృష్టిస్తున్నందుకు

హేతువాదీ దూరదర్శీ కార్యశీలీ
డా॥ నరేంద్ర దభోల్కర్, జీవిత కాలంలో మిము గుర్తించలేనందుకు
మత ఛాందసుల కరకు కరవాలాల నుండి
మిము మేం రక్షించుకోలేనందుకు
వర్తమాన వాస్తవిక జగత్తులో
నిశ్చేష్టులుగా నిష్క్రియాపరులుగా కుహనా మేధావులుగా
మిగిలిపోయినందుకు
సిగ్గుతో తలలు దించుకొంటున్నాం.

కథ

# బడి ఎంతెంతో దూరం



- మంచికంటి
9949535695

బడి వొదిలి పెట్టినప్పుడు ఉరుకులు పరుగులు మీద పరిగెత్తే పిల్లల్లా పక్షులు గోలగోలగా అరుస్తూ గూళ్ళకు చేరుకుంటున్నాయి. పొలాలకు పనులకెళ్ళిన వాళ్ళంతా కళ్ళనిండా పిల్లల్ని కలగంటూ హడావుడిగా ఇళ్ళవైపు పరుగులాంటి నడకతో వెళ్తున్నారు. పగలు బద్ధకంగా వొళ్ళు విరుచుకుంటూ రాత్రిలోకి తొంగి చూస్తుంది. పడమటి ఆకాశాన నెలవంక నవ్వుతూ పల్లెవైపు చూస్తుంది.

అధికారుల హడావుడి, డిఈవో దగ్గర్నుండి, డిపెప్ నుండీ సర్క్యులర్ల మీద సర్క్యులర్లు. అన్నింటికంటే డ్రాపవుట్స్ తగ్గించమని నెత్తిమీద కెక్కి తొక్కుతున్న వరల్డ్ బేంక్. దాంతో రాత్రికీ పగలుకీ తేడా మరిచిపోయి పిల్లల వెంటపడడం టీచర్ల వంతయింది.

పల్లెల్లో చీకటితో పనులకు పోయిన వాళ్ళు, చీకటి పడిన తరువాతే ఇళ్ళ దగ్గర దొరికేది. అందుకే చీకటి పడుతున్నా పల్లెదారి పట్టాం.

అంబేద్కర్ విగ్రహం నిటారుగా నిలబడి చూపుడు వేలు బడివైపు చూపిస్తున్నట్టుగా ఉంది. దారి పక్కనే చచ్చిన గొడ్డు దట్టెం పడేసి ఉంది. కాకులూ గద్దలూ దానిమీద వాలి పీక్కుతింటున్నాయి.

ముక్కులు బద్దలయ్యే ఆ వాసనకి తెలీకుండానే చెయ్యి ముక్కు మీదికి పోయింది. ఊరికి దూరంగా విసిరివేయబడేట్టు ఉన్న ఆ పల్లెలో చుట్టు గుడిసెలు, నిట్టాడి గుడిసెలు, కింద గోడలు లేకుండా పైన తాటాకుల కప్పులు, గోడలు పడిపోయి పాడుబడ్డ ఇళ్ళు, వాకిళ్ళకు రేకులు, మంచాలు అడ్డంబెట్టిన ఇళ్ళు, అక్కడక్కడా స్కీముకింద శాంక్షనై పూర్తికాని పక్కా ఇళ్ళు ఊరిలోకి పోయిన వాళ్ళకు దర్శనమిస్తుంటాయి.

మమ్మల్ని చూసిన పిల్లలందరూ మా చుట్టూ చేరారు. వాళ్ళందరితోటీ ఊరేగింపుగా బడికిరాని పిల్లల్ని వెతుక్కోవడంలో మునిగిపోయాము.

లిస్టుచూసి "ఒరే శీనూ కృష్ణవేణి ఉందేమో చూడరా అనడంతో, "ఆట్నించే వొచ్చాను సార్ నేను. గుడిసెకి మంచం అడ్డంబెట్టి ఉంది. వాళ్ళ అమ్మానాన్న నందానం వచ్చాకొట్టుడుకి ఎల్లేరు. ఈ యమ్మాయి సెనక్కాయల కోతకెళ్ళింది. వాళ్ళ తాత ఎక్కడో తిరగడానికి ఎల్లేడు"

అంటూ వివరం చెప్పాడు.

"ఆ వెంకటలక్ష్మి సంగతేదో కనుక్కుందాం పదండి" అంటూ వాళ్ళింటి వైపు బయలు దేరాము.

సార్ సార్ అదుగోండి సార్ వాళ్ళమ్మ ఇటొస్తంది" అంటూ అటుగా వొస్తున్న ఆమెను చూయించారు పిల్లలు.

ఎదురొచ్చిన ఆమెను ఆపి, "ఏమ్మా ఏది వెంకటలక్ష్మీ? బడి మానేసిందా ఏంది? ఎన్ని రోజులు అయింది బడికి వొచ్చి" అన్నాను కాస్త హెచ్చు స్వరంతోనే.

"అయ్యా అయ్యా ! పదిరోజులు వొదిలిపెట్టు. మారాజా మారాజా రొవ్వంత పనులుండయ్యి. అయ్యి అయిపోయిందాకా రాదయ్యా" అంటూ బతిమలాడసాగింది.

"సర్సర్లే పోపో. పనులు అయిపోయిన తరవాతైనా రోజూ బడికి పంపు" అని ముందుకుసాగాము.

"ఒరే ఆ పిల్ల సుకన్య సంగతేందో చూడండి. ఒకరోజు వస్తది. పదిరోజులు ఎగనామం బెట్టుద్ది" అనడంతో రమేషు పరుగెత్తుకుంటూ పోయి, ఆయాసంతో వెనుదిరిగి వొచ్చాడు.

"సార్ ఆపిల్ల ఇంటి దగ్గరే ఉంది సార్. ఎప్పుడూ ఇంటికాడ ఏదో ఒక పని చేస్తానే ఉంటది" అంటూ ఆ పిల్ల మీద చాడీలాగా చెప్పాడు.



దూరంగా కట్టమీద ఒకే ఒక గుడిసె. గుడిసె ముందో కుక్కి మంచం నిలబెట్టి ఉంది. మంచం చాటున రెండు వొరసల ఇటుక రాళ్ళు పొయ్యి ఆకారంలో పెట్టి ఉన్నాయి. పొయ్యి గణగణా మండుతుంది. పొయ్యి మీద రాగిసంగటి కుతకుతా ఉడుకుతుంది.

"ఏమ్మాయ్ ఎన్ని రోజులైంది బడికివొచ్చి" గద్దించాను ఆ అమ్మాయిని సమీపించడంతోనే.

ఆ అమ్మాయి కుక్కి మంచం పక్కనే తల వాల్చి మౌనంగా నిలబడింది.

"ఏందమ్మాయ్ మూగి మొద్దులాగా మాట్లాడవు. బడికెందుకు రావడం లేదు. మళ్ళీ గద్దించాను.

ఉలుకూ పలుకూ లేకుండా అలాగే నిలబడింది.

నా పద్ధతే మార్చుకుని, ఇట్రామ్మాయ్ అంటూ దగ్గరికి పిలిచాను. రేయ్ చూడండ్రా ఈ యమ్మాయి పనెట్ల చేస్తుందో మీరుకూడా చూసి నేర్చుకోండ్రా. కూరకూడా నువ్వే చేస్తావంటమ్మాయ్" అనడంతో అ అమ్మాయి తలూపింది.

ఇట్రామ్మా ఇట్రా అంటూ దగ్గరికి పిలిచి చెయ్యిపట్టుకుని పరిశీలనగా చూస్తూ బడికి రాకపోతే ఎట్టమ్మా చెప్పు. వేళకి బడికి వొచ్చి బాగా చదువుకోవద్దా ! బళ్ళో కూడా బోల్డన్ని ఆటలు ఆడుకోవచ్చుగదా! ఆ.. అన్నాను తలనిమురుతూ.

అయినా ఆ అమ్మాయి కళ్ళల్లో బెదురు పోలేదు. "ఈ చెయ్యి మీద ఇంత పెద్ద మచ్చేందమ్మాయ్" అన్నాను మణికట్టు మీద మచ్చను చూపిస్తూ.

అప్పుడు నోరు విప్పిందా అమ్మాయి. "మరే... మరే పసికర్లవితేనూ కాలిపిచ్చేరు. ఇక్కడ ఎవురికి పసికర్లయినా కాలిపిత్తారుగా. మమ్మ ఉండప్పుడు ఇంటూరికి తీసకెళ్ళి కాపిచ్చింది. అది పేద్దపుండయ్యింది. ఆ తరువాత ఆముదం వొత్తేస్తేనూ మానిపోయి పెద్ద మచ్చ పడింది" అంటూ చెయ్యిని వెనక్కు లాక్కుంది.

"ఏందమ్మాయ్ పసికర్లకి మందులు వాడకుండా ఇంకా కాలుస్తున్నారా! ఆ అంటూ నోరు తెరిసాను.

"అవున్సార్... పోయిన సంవత్సరం ఆదిలక్ష్మికి కూడా అవితేనూ, ఆ యెమ్మాయికి కూడా కాల్చేరు. ఇంక అదే తగ్గిపోద్దిలే అని గమ్మునుండారు. ఆ తరువాత ఒకరోజు కోడికూర బెట్టిందంట వాళ్ళమ్మ. అది తిన్న నాల్రోజులుకి ఆయెమ్మి సచ్చిపోయింది" అంటూ రమేష్ ముందుకొచ్చి చెప్పేడు.

"ఐతే సుకన్యా ఎందుకమ్మాయ్ ఒకరోజు బడికొస్తే వారం రోజులు రావు అన్నాను" బతిమాలుతున్నట్టుగా.

నేనూ ఊ... ఉళ్ళ సార్.. నేనూ ఇంటికాడ పంజేసి కసువు జిమ్మి కళ్ళాపి జల్లి, కూడొండీ, కూరజేసి, కూడుతినే తలికి ఆలిసెమైపోతంది. అందుకే ఆ తరువాత వొద్దామంటే పిల్లలందరూ వొంటేలుకి వొస్తంటారు. అప్పుడప్పుడు మానాన తోటే పొలానికి కూడా తీసుకోని ఎలతాడు." అందుకే రావటంలా అమాయకంగా చెప్పింది.

"అదేందమ్మాయ్ ఈ పనులన్నీ నువ్వు చెయ్యడమేంది? మీ అమ్మెక్కడికి వెళ్ళింది" అన్నాను ఆశ్చర్యంగా.

"మమ్మా మమ్మా... సచ్చిపోయింది సార్" అంటూ కళ్ళవెంట జల జలా కన్నీళ్ళు కారతావుంటే కళ్ళు రుద్దుకుంటూ బోరుమని ఏడవసాగింది.

"మ్మాయ్... అమ్మాయ్ అమ్మాయ్ సుకన్యా యాడవబాకమ్మా. మమ్మ మంచిదానివి ! చూడు పిల్లలందరూ ఎట్ట ఎగతాళి చేస్తున్నారో యాడవబాకమ్మా అంటూ అమ్మాయిని ఊరుకో బెట్టడానికి తలప్రాణం తోకకొచ్చింది.

అప్పటికి ఆ అమ్మాయి ఏడుపు ఆపి బిక్కు బిక్కుమంటూ నావైపు చూడసాగింది.

"ఏమ్మాయ్ ఎప్పుడు సచ్చిపోయింది మీ అమ్మ" అనునయంగా అన్నాను.

"రొండు సంవత్సరాలైంది సార్" గుంపులో నుండి అరిసింది శకుంతల.

"అవునంటమ్మాయ్" అని గడ్డం కింద చెయ్యేసి తలపైకి లేపాను.

"ఆ అంటూ తలపైకీ కిందకీ ఊపింది.

"ఎందుకు సచ్చిపోయిందమ్మాయ్" వివరం అడిగాను.

"మరే మరే... మా అమ్మా... మా బాబు ఎప్పుడూ తాగుతుళ్ళా అందుకూ" అంది ఒక్కో అక్షరం కూడ బలుక్కుంటూ.

మా బాబు ఎప్పుడూ తాగుతూ ఉంటాడుగా! తాగొచ్చి మమ్మల్ని ఇరగదంతా ఉండేవోడు. అసలేం పనీ జెయ్యడు. మాకు తింటానికి గూడా ఏమీ తేడు. ఇంకా అమీన్ బాబుగాడు మా తమ్ముడుళ్ళా. వాడి దగ్గరుండ రూపాయో అర్ధరూపాయో గూడా లాక్కోని బీడీలు కొనుక్కుంటాడు.

ఒకసారి నేనేమో కూడుదింటా కూచ్చోనుండా చొరుగుతా చొరుగుతా వొచ్చేడు. వొచ్చీరావటంతోటే వొసే లచ్చిమి ముండా అంటూ జుట్టు పట్టుకున్నాడు. ఉట్టిపున్నేనికే! ఏమీ జెయ్యాలా మమ్మ. నాకేమో ఏడుపొస్తుంది. తలొంచి దమీదమీ దమీదమీ గుద్ది, పోయే ముదనష్టపుముండా అంటూ నన్ను అవతలకి నెట్టిపారేసేడు. మంచం కోడుమీద వడ్డాపోయి. అప్పుడే నెత్తురొచ్చింది. అందుకే కదుం కట్టింది" అంటూ నుదుటిన ఉన్న మచ్చ చూయించింది.



"ఐతే మీనాన్న తంతున్నాడనే మీ అమ్మ సచ్చిపోయిందటమ్మాయ్" తరువాత వివరాలకోసం అడిగాను.

"అహాకాదు. ఇదిగో ఎప్పుడూ తాగేవోడు కదా! మానాన పనికిపోడుగా! సేపలమ్ముకోని మమ్మ బియ్యం తెచ్చేది. బిస్కెట్లు తెచ్చేదీ, గుగ్గిళ్ళు తెచ్చేదీ!

ఎప్పుడూ తాగుతా ఉంటాడుగా మా బాబు, అక్కడ చెట్టున్నే, సెంటర్లో యాపసెట్టు, ఆ యాపసెట్టు కింద అరుగుళ్ళా జాలమ్మరుగు, ఆడజేరి పేకాట ఆడుకుంటా ఉండేవోడు.

మమ్మేమో పొద్దునే కరవాక్కిపోయి, పడవలు వొస్తుళ్ళా! ఆడ సేపలు గంపకేసకొచ్చి పాదర్తీ, మోటుమాల అక్కడకొచ్చి అమ్మేది.

గుడ్లు మిటకరిచ్చుకోని ఒకసారి అట్నే వొచ్చేడు. దబ్బుడిగేడు. బాగా నిసా మీదుండాడుగామాలా! వొచ్చీ రావడంతోటే బయట పేద్ద ఇంతలావు కర్రుంది. అది తీసుకొని వొక్క ఏటేసేడు. అప్పుడే మమ్మ తలపగిలి నెత్తురు వోరవలు వోరవలు అయ్యింది. వొళ్ళంతా నెత్తురే, గుడ్డలంతా నెత్తురు.

ఏమీ జెయ్యకుండానే ఇయ్యాల తల పగలగొట్టేడు. ఇంక తరువాత ఏమైనా జేస్తాడని నన్నూ, మా అమీనుగోణ్ణీ తీసుకొని అట్నే నెత్తురు గుడ్డల్తోటే బస్సెక్కిందిమమ్మ.

మా అమ్మమ్మ గారి ఊరెళ్ళాం సార్! ఆడగూడా మన బడిలాంటి బడే ఉంది. ఆ బళ్ళోకి నేను కూడా పోయా. అబ్బో బళ్ళో మాష్టారు బలే బేకుతాడు. బొర్ర మీసాలుంటయ్యి. సెప్పినమాట ఇనకపోతే రొండు మూడొందల గుంజిళ్ళు తీయిస్తాడు. టీచ్చరు గూడా ఉండుద్ది. అస్సలు కొట్టదు. నేను టీచ్చరు దగ్గిరే కూచ్చుండే దాన్ని" అంటూ ఆనందంగా చెప్పింది.

"అక్కడకూడా బడికెళ్ళేవన్నమాట. అయితే అక్కణ్ణుండి మళ్ళీ ఎందుకొచ్చేరు".

ఆరునెల్లు మమ్మమ్మ గారి ఊళ్ళోనే ఉండాం. అప్పుడప్పుడూ ఎవురు సేతో చెప్పి పంపేవోడు మమ్మని రమ్మని. మమ్మేమో నేను బోనమ్మా ఆ యెదవ ఏదో ఒకనాడు వల్లకాట్లోకి ఈడ్సినా ఈడుస్తాడు అనేది.

అయితే ఒకరోజు మళ్లీ మా బాబే వొచ్చేడు. నేను గబుక్కున బోయి మంచం సాటున దాంకున్నా. సుకన్నా మేయ్. ఇట్రామ్మా అంటూ నన్నే పిల్చేడు. నాకప్పుడు బలే బయ్యం బుట్టింది. మాయమ్మ గూడా లేసి ఇంట్లోకి పోయింది. మా అయ్య ఎనకమాలే ఇంట్లోకి పోయేడు. బతిమాలాడేడు. గడ్డం పట్టుకున్నాడు. ఇంకెప్పుడూ తాగనని ఒట్టేసాడు. ఇంక కొట్టనంటే కొట్టనన్నాడు. అయినా మాయమ్మ ససేమిరా అంది. అంతలోకే మమ్మమ్మ వొచ్చి సెడా మడా తిట్టింది.

మా పిల్లరాదుపోరా అంటూ కేకరిచ్చి మొకాన ఊసింది. ఐనా కాళ్ళకీ యేళ్ళకీ పడ్డాడు. అప్పటికి ఇద్దరూ మెత్తబడ్డారు.

ఇంక మళ్ళీ గుడ్డలూ, బొమ్మలూ అన్నీ సంచిలో పెట్టుకున్నాము" అంటూ పొయ్యివైపు చూసింది. పుల్లలు బయటకొచ్చి ఆరిపోతుండడంతో అటు పరుగెత్తి పుల్లలు లోపలికి తోసి మంటేసి మళ్ళీ వొచ్చింది.

ఆ అమ్మాయి జ్ఞాపకాల్ని మాతో పంచుకోవడానికి ప్రయత్నించడంలో ఒక రకమైన అనుభూతిని పొందడం గమనించాను. అందుకే వింటూనే కూర్చున్నాం.

అప్పుడు నిన్ను తీసుకొని ఈ ఊరొచ్చిందా! అన్నాను పొడిగింపుగా.

"ఆ మా అమ్మా నేనూ మా బాబూ అందరిమీ బస్సెక్కి వొచ్చేము. సింగరాయకొండ దాకా వొచ్చి అక్కణ్ణుండి రైలు బండి ఎక్కేము. బండ్లో నాకు మా బాబు బిస్కెట్లూ, జాంకాయలూ, పప్పు బిళ్ళలూ ఇంకా శానా శానా కొనిచ్చేడు. రైలు బండెక్కితే బలే బాగుంది. వో... యెంత పెద్దదనే ఈ చివరెక్కి ఆ సివరకి పోవొచ్చు. నేనటూ ఇటు తెగ పరిగెత్తేను.

"తరువాత బస్సెక్కి మీ ఊరోచ్చేసేరా అన్నాను" వొదిలేస్తే రైలు బండితోటే తెల్లార్లే టట్టుందని.

"అవును మా అమీను బాబుగోడు కూడా అప్పుడే మొదటిసారి రైలెక్కడం. ఇద్దరం కలసి బలే ఆడుకున్నాం రైల్లోనే. ఇప్పుడు హైద్రాబాద్‌లో ఉండాడు. మమ్మ పోయిం తరువాత బడి మానేసి బేల్దారి పనులకెళ్ళాడు. నాగరాజూ, పోలయ్యా వాళ్ళతోటే ఎల్లేడు" దిగులుగా అంటుంటే ఆ అమ్మాయి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై.

"మరి మీ అమ్మ అసలెందుకు చచ్చిపోయింది. తొందరగా ముగిద్దామని ప్రశ్నించాను.

"ఆ... ఆ... మమ్మా. మేము వొచ్చాంగా ఊర్నించి. అప్పుడు కొద్దిరోజులు మానాన తాగలా. ఒకరోజు రేత్తిరి పూట నేను నిద్రపోయిన తరువాత ఎందుకో ఇద్దరూ తగాదా పెట్టుకున్నారు లాగుంది. ఆ అరుపులకి ఉలిక్కిపడి లేశాను. ఇద్దరూ కలెబడ్డారు.

అప్పట్నుండీ మళ్లీ తాగడం మొదలుబెట్టేడు. అసలు తాగుడు మానేత్తేగా. ఊరికే మా అమ్మని అట్ట బురిడీ కొట్టిచ్చేడు. మళ్లీ అప్పట్నుండీ ఇంట్లో గోల జేస్తానే ఉండాడు.

ఒకరోజు ఏదో కాయితం దెచ్చి, దానిమీద యేలు ముద్దర యెయ్యమన్నాడు. ఎందుకంటా ముద్దర" అంది మమ్మ.



సెబితేగానీ యెయ్యవా. అంతలావు గవునేరివి యెప్పుడయ్యావే. ఇదిగో సెబుతుండా ఇను. మీ యమ్మగారి పసుపూ కుంకుమల కింద ఇచ్చిన ఇసకపొలముందే అది నాపేరన రాయటానికే" ఈ ఏలు ముద్రలు అన్నాడు.

"నా బొందిలో ప్రాణం ఉండగా అది జరగదు. ఇప్పటిదాకా ఉండయ్యన్నీ అమ్మకనూకి తాగి తగలేసింది చాల్లా. ఇదికూడా రాసిస్తే దాన్నికూడా అమ్ముకోని తాగుదామనా. చస్తే ఆపని మాత్రం చెయ్యను' తెగేసి చెప్పింది మమ్మ.

అప్పటికే మణిసి బాగా తాగుండాడు. జుట్టు లంకిచ్చుకోని వొంగబెట్టి బాదడం మొదలు బెట్టేడు. మమ్మ ఏడుస్తానే" నన్ను కొట్టు సంపు నేనుగా ముద్దర యెయ్యనంటే ఎయ్యనని మొండికేసింది. అప్పుడుల్లా కాల్తోటీ సేత్తోటీ తెగదన్నాడు. పడేసి ఈడిసేడు.

నాకింక బయ్యం బుట్టి పరిగుత్తుకూంటా బళ్ళోకి వొచ్చేను. ఆ తరువాతేం జరిగిందంటే! ఆ.. అమీనుగోడు గూడా బడికి వొచ్చేడు. తలగోక్కుంటూ గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ, మళ్లీ బడి వొదిలి పెట్టినాక ఇంటికిపోయేం.

తలుపేసుంది. తలుపు తోశాము. బయట చిలుకు తీసి ఉండా కానీ రాలా. లోపల గడిబెట్టి ఉందికామాల! దమాదమా తలుపు బాదినా రాలేదు. పక్కనోళ్ళు కూడా వొచ్చేరు. అందరూ పోగయ్యారు. యాణ్ణో ఉంటే మా బాబుని కూడా పిల్చుకొచ్చేరు. అందరూ కలిసి తలుపు పగలగొట్టి లోపలకెల్లేరు. మమ్మ సచ్చిపోయి నట్టింట్లో పడుంది. మా బాబు ఒకటే ఏడుపు లంకిచ్చుకున్నాడు. చేసిందంతా చేసి ఇంకా ఏడుత్తున్నావా అని మా బాబునే సెడా మడా తిట్టేరు.

వొరి గడ్డేసి బైట పండేసేరు. అప్పట్నుండీ రోజూ మమ్మ కల్లోకొచ్చి మా బాబు గుండెల మీదకెక్కి తొక్కుతుందంట. అందుకనే అ ఇల్లు వొదిలేసి ఆడ ఉండలేక, ఈడ గుడిసె కట్టి ఈడకి తీసకొచ్చేడు మా బాబు.

"అయితే నువ్వు మీ అమ్మమ్మ దగ్గరకెళ్ళి ఉండొచ్చుగా అమ్మాయ్" అన్నాను జాలిగగా.

"తరువాత మా అమ్మమ్మ గూడా గుండెపోటొచ్చి సచ్చిపోయింది. అక్కడకెలితే మామామ పెళ్ళాం బలే సుప్పనాతి ముండ. మణిసి సాయ అట్నే ఉరిమురిమి సూసిద్ది. అక్కడకెళ్తే మాకు కూడు గూడా సరీగా పెట్టదు. అందుకే మామామ రమ్మన్నా మేమే ఎల్లం.

ఇప్పుడు మా బాబూ నేనే ఉండేది. అమీనుగోడు కూడా లేడుగా అందుకే పన్లన్నీ నేనే చెయ్యాల. ఎప్పుడన్నా సేపలకూరా, గుల్ల మాంసమూ అయితే మా బాబే వొండుతాడు.

అప్పుడప్పుడూ మా బాబుని సూత్తే బలే బయ్యం పుట్టుద్ది. నన్ను వొళ్ళో కూకో బెట్టుకోని తాగిన మైకంలో బలే ఏడుస్తాడు. అప్పుడు నేను కూడా ఏడుస్తాను.

అందుకే చీకటి పడతందంటే నాకు బలే బయ్యం బుట్టుది. గబ్బుగీము సీకట్లో ఒంటేలొచ్చినా గట్టిగా కళ్ళుమూసుకోని పడుకుంటాను. గానీ లేవనేలేవను. అల్లా తాడిసెట్ల కాడ శానామందికి తెల్లగుడ్డలు కట్టుకోని కనిపిచ్చిద్దంటమమ్మ. అందుకే ఇంటి ముందంతా రేగ్గంప పాతేడు మాబాబు. అదిగో తడిక్కి కట్టిన బొంత జెముడు కూడా అందుకే.

అప్పుడప్పుడు నాకుగూడా కల్లోకొస్తది మమ్మ. బాగా సదూకోమ్మా అంటది. ముద్దు పెట్టుకుంటది. ఇంకా ఏందేందో సెప్పుద్ది. నాకు మెలుకువొచ్చి చూస్తే మాబాబు పక్కనే ఉంటాడు. గట్టిగా పట్టుకోని పడుకుంటా" అంటూ ఆ అమ్మాయి భయం భయంగా చెబుతుంటే గుండె పిండేసినట్టయింది.

"సరే సుకన్యా నీకు పని ఉండప్పుడు పనిజేసుకోని తొందరగా బడికి రావాల. అంతేగానీ బడి ఎగ్గొట్టకూడదు" అని చెప్పాను.

అట్నే అంటూ ఆ అమ్మాయి పొయ్యి మీద ఉడుకుతున్న అన్నం గిన్నె మీద మూత తీసి తెడ్డుతో అన్నం ఉడికిందీ లేనిదీ చూస్తుంది.

ఇంక పోదాం పదండ్రా అంటూ ఇంకో ఇంటికి పోవడానికి లేశామే కానీ, బడికి రాని పిల్లలందరికీ వాళ్ళ కథ వెనుక వాళ్ళ స్థితిగతులు, కష్టసుఖాలు, దారిద్ర్యం ఎన్నెన్నో కారణాలుంటాయనేది నగ్నసత్యం. అయినా మన ప్రయత్నం మనం చెయ్యాలగదా అనుకొని ముందుకి కదిలాము.

## కవిత

# గ్లోబల్ ప్రేమ !?

- జంధ్యాల రఘుబాబు
9849753298



నీకిష్టమైన రంగు?
వంకాయలో నలుపు మిక్స్
అబ్బో నాకూ అదే ఇష్టం !
నీవు 'స్పే' ఏది లైక్ చేస్తావు
'ఫో' జెంట్స్, మరి నీవు
'ఫో' విమిన్
అబ్బో అబ్బో ఇద్దరిదీ....
నెట్ వర్క్ ఏది?
'సూగుల్', మరి నీసంగతో
అరెరె, అబ్బో అబ్బో నేనూ అదే
మన చూపులు
మన మనసులు
మన ఇష్టాలు
అన్నీ అన్నీ కలిశాయే
థ్యాంక్స్, నన్ను రోజు డ్రాప్ చేస్తున్నందుకు
మనలో అలాంటివి ఉండకూడదు
టూ స్మార్ట్!
టూ అఫెక్షనేట్!

ఇష్టమైన వెడ్డింగ్ రింగులు
ఇష్టమైన పెళ్ళికార్డులు
పిప్పి, డుం డుం
రెండు క్యాలెండర్లు మారాయి
మనుషులతో, మనసులతో సహా
ఎందుకీ మధ్య పిక్ అప్ చేసుకోవట్లేదు

ఆఫీసులో బిజీ బిజీ
నువ్వు వీకెండ్
పార్టీలివ్వటం మానేశావ్
నువ్వు ఆ రెండు రోజులూ
కనిపించటమే మానేశావ్
స్పే ఎందుకు మార్చావు
బోర్ కొట్టింది
నెట్‌వర్క్ 'హూయా'కు
ఎందుకు మారావు
నా నెట్‌వర్క్ నా ఇష్టం
నేను రోస్ట్ చేసిన బ్రెడ్ పడేస్తున్నావ్
నేను తెచ్చిన గాగుల్సు విసిరేశావ్
నిన్ను నమ్మకూడదు
నిన్నూ అంతే
నువ్వు మారావ్
నువ్వు అంతే
నువ్వు మొండివి
నువ్వు జగమొండివి
నేను వెడుతున్నా!
నేను కూడా !!

---

# అమ్మ చీర

- శ్రీమతి కనుపర్తి విజయబక్ష్
9441382303



అమ్మ చీర కాదది అనంత దుఃఖాలకు ఉపశమనం
కళ్ళు తెరిచిందాదిగా పొత్తిగుడ్డల్లో ఒదిగిపోయింది
'ఉంగ' కొడుతు ఊఁ ఊఁ లన్నది ఆ చీరలోనె
మడత లేసిన మెత్తని చీరలోని నులివెచ్చదనం
నిద్రసుఖం, మైమరపు అన్ని యిచ్చింది అమ్మ చీరే
వెక్కి వెక్కి ఏడ్చేటి వేళ
కమ్మని నిద్రపుచ్చింది అమ్మ చీర ఊయలే
అమ్మ చీర ఊయల్లో అటు యిటు ఊగుతుంటే
లోకానికంత నేనే ఏలికైనంత గిలిగింత
అమ్మ మెత్తని ఒడిలో అడ్డంగ పడుకొని పాలుతాగుతుంటే
దిష్టి తగలకుండ అడ్డుపడింది అమ్మ చీర కొంగే
నిద్రలో భయమేస్తే బిగించి పట్టుకొంది అమ్మచీరెనే
కొత్త వారెవరైనా రారమ్మని పిలుస్తూ ముద్దు చేస్తుంటే
సిగ్గునీ భయాన్ని దాచింది అమ్మ చీర కుచ్చిళ్ళలోనే

ఎదుగుతుంటే ఆటల్లో అమ్మనయినట్లు దర్జాగా
చుట్టబెట్టుకొంది అమ్మచీరనే
నేనమ్మనయ్యేక కూడా కష్టాల కన్నీళ్ళ వరదంతా
ఇంకిపోయింది అమ్మ కట్టుకొన్న చీరలోనే
అమ్మలేకున్నా అమ్మచీరే తోడీ రోజు
అమ్మ శరీరాన్నంటి పెట్టుకొన్న ఆ చీరే చేతులై
విచారంలోను వేదనలోను నా కన్నీళ్ళు తుడిచేది
నాకెన్ని చీరలున్నా అమ్మచీరతో కన్నీళ్ళొత్తుకుంటే
ఎంత ఓదార్పు ! ఎంతతోడు !!
ఎంత ఆసరా !!! ఎంత ఉపశమనం !!!!

# ఆధునిక కథ - క్షౌరవృత్తి చైతన్యం

సింధూ నాగరికత నాటికే ఈ వృత్తి స్థిరపడిందని తవ్వకాల్లో దొరికిన రాతి విగ్రహాల రూపాన్ని పరిశీలించిన చరిత్రకారులు నిర్ణయించారు. జైన బౌద్ధాల్లో క్షురకర్మను విద్యగా భావించారు. ఇది మనిషి శరీర ఆరోగ్యానికి అవసరమైంది. ప్రాచీన సాహిత్యంలో ప్రతిఫలించని ఈవృత్తి, ఆధునిక సాహిత్యంలో కూడా తగినంతగా ఆవిష్కరించబడలేదని భావించాలి. ఎనభైల తర్వాత తలెత్తిన అస్తిత్వ ఉద్యమాల వెలుగులో కథల్ని పరిశీలించినపుడు అక్కడక్కడ ఈ వృత్తి చైతన్యం ప్రస్ఫుటమవుతుంది.



- డా. లంకా వెంకటేశ్వర్లు

9493890138

మన దేశంలో క్షురకునితో సంబంధం లేని పురుషుడుండడు. అతి ప్రాచీన సేవకవృత్తిగా ఇది ప్రసిద్ధి పొందింది. సింధూ నాగరికత నాటికే ఈ వృత్తి స్థిరపడిందని తవ్వకాల్లో దొరికిన రాతి విగ్రహాల రూపాన్ని పరిశీలించిన చరిత్రకారులు నిర్ణయించారు. జైన బౌద్ధాల్లో క్షురకర్మను విద్యగా భావించారు. ఇది మనిషి శరీర ఆరోగ్యానికి అవసరమైంది. ప్రాచీన సాహిత్యంలో ప్రతిఫలించని ఈవృత్తి, ఆధునిక సాహిత్యంలో కూడా తగినంతగా ఆవిష్కరించబడలేదని భావించాలి. ఎనభైల తర్వాత తలెత్తిన అస్థిత్వ ఉద్యమాల వెలుగులో కథల్ని పరిశీలించినపుడు అక్కడక్కడ ఈ వృత్తి చైతన్యం ప్రస్ఫుటమవుతుంది. **'తలలేనోడు'** ఆచార్య కొలకలూరి ఇనాక్ రచన. తలలేనోడు ఒక క్షౌర వృత్తిదారుని జీవితంలోని విధ్వంసాన్ని ఆవిష్కరించింది. ఇది క్షౌర వృత్తిని కేంద్రంగా తీసుకొని రాసిన తొలికథ. ఊరబావి కథల సంపుటిలోనిది. కథ కంటే కథనం, పాత్ర చిత్రణ, మంచి శిల్పంతో బిగువుగా సాగిన రచన. రచనలోని భాషను బట్టి ఇది రాయలసీమలోని భూస్వామ్య సమాజపు పడికట్టును తెలియజేస్తుంది. ఆ పల్లెలో వీరన్న మోతుబరి. మునసబు. తరతరాలుగా డబ్బు, అధికారమున్నవాడు. తన స్థాయికి తగినరూపం. కోటి ఆ వూరిలో క్షురకుడు. అతని కొడుకు నాగలింగం. చదువు అబ్బక పోవటంతో కులవృత్తిని నేర్చాడు. నాగలింగానికి తండ్రి సంపాదించిన రెండెకరాల పొలం ఉంది. వయస్సు రీత్యా నాగలింగం, వీరన్న మునసబు దాదాపు ఒక యీడు వాళ్ళు. వీరన్న వ్యవహార జ్ఞానంలో, ఎత్తుకు పై ఎత్తులు, కుయుక్తులు పన్నటంలో ఆరితేరినాడు.

ఒకరోజు కోటి తన రెండెకరాల పొలంలో వేరుశెనగ పీకించి పనలు పెట్టించాడు. వీరన్న చేలో కోయించిన వేరుశనగకాయల బస్తాలతో వస్తున్న బండ్లు కోటి చేలో నుంచి తోలాడు జీతగాడు. రెండు బండ్లు చేను మధ్యలోకి వచ్చిం తర్వాత కోటి చూశాడు. కోపంగా మునసబు గారి జీతగాళ్ళని కేకలేసిన కోటి గురించి కొన్ని కల్పించి వీరన్నకు చెప్పారు జీతగాళ్ళు. వీరన్న అవమానంగా భావించాడు. "ఆడికి రెండెకరాలు వుండబట్టే కదా ఆడిట్టా కూసింది" అని కోటిపై క్రోధం పెంచుకున్నాడు. చిన్నప్పటి స్నేహితుడైన "నాగలింగం భుజం మీద చేయి వేస్తే పొంగిపోయి, వెంటబోయాడు. వీరన్న ఇంట్లోకి తీసుకుపోతుంటే "దేవేంద్ర లోకంలోకి పోతున్నామనుకున్నాడు నాగలింగం"" ఇలా నాగలింగం వీరన్న వలలో చిక్కుకున్నాడు. తాగుడు, పేకాట, వ్యభిచారం వంటి చెడు వ్యసనాలకు నాగలింగం లోనయ్యాడు. పేకాటలో డబ్బు అవసరమై అప్పుగా నోటు రాసి వీరన్న దగ్గర డబ్బు తీసుకొని ఖర్చుపెట్టేశాడు. అసలుకు వడ్డీ, వడ్డీకి వడ్డీ కలపి పదేళ్ళ తర్వాత నాగలింగానికి నోటీసు పంపాడు వీరన్న. ఆస్తి కోటిది కనుక రెండెకరాల గడువు పై కూడా కోర్టులో దావా వేశాడు. కోటి కోర్టులో ఓడిపోయాడు. పొలం కోల్పోయాడు. పన్నెండేళ్ళ నాటి

పగ తీర్చుకొన్నందుకు వీరన్న దేవుడికి మొక్కుకున్నాడు. తలజుట్టు పెంచుకున్నాడు. "కోటి గాడు గాని, ఆడి కొడుకు గాని, ఈ జుట్టు తీయకపోతే, ఈ తల తీసినట్టు గాదా" అనుకున్నాడు. తల జుట్టు తీయించి తిరుపతిలో హుండీలో వేయించాలనుకుంటాడు వీరన్న. వీరన్నకి గుండు గీయటానికి నాగలింగం రావటంతో ఈ కథ మొదలవుతుంది. నాగలింగం క్షవరం చేస్తున్న క్రమం వర్ణించటంలో కథనం అద్భుతంగా ఉంటుంది. గత పన్నెండేళ్ళ కథని ఆ సమయంలో సందోర్భోచితంగా గుర్తుచేస్తూ మొత్తం సంఘటనని శిల్పభరితం చేశాడు రచయిత. "తలముందు జుత్తు అంతా గీసేసింది కత్తి. అక్కడక్కడా మిగిలిపోయిన వెంట్రుక మొనలు అద్దం మీద పడ్డ నల్ల దుమ్ములాగా ఉన్నాయి. చూపుడు వ్రేలు, బొటనవ్రేలు మధ్య కత్తి రెండెడ్ల మధ్య నాగలిలా శిరక్షేత్రం దున్నుకుపోతూ ఉంది. వెనక్కి ముందుకు, క్రిందికీ పైకీ" ఇలా మొత్తం కథ వృత్తి పనితనాన్ని అద్దం పట్టి చూపుతుంది. నాగలింగం క్షవరం పూర్తి చేశాడు. పైన పేర్కొన్న కథ నిండా నాగలింగం తనకు జరిగిన అన్యాయానికి పొగిలిపోవటం గర్భితంగా కనిపిస్తూ ఉంటుంది. తనను ఎలా మోసం చేసిందీ దోపిడికి గురిచేసిందీ నెమరేసుకుంటాడు. కథలో కథనంలో సందర్భోచితంగా రచయిత చూపిన పోలికలు నాగలింగం ఎంత విధ్వంసానికి లోనవుతున్నదీ నిరూపిస్తున్నాయి. "వీరన్న గొంతుతోలు కింద, మెడతోలు మడత కింద, తెగిపోకుండా దాక్కుని, నిక్కి చూస్తు వుంది వెంట్రుక మెటిక. నాగలింగం సర్రుని కత్తి తీశాడు. గడ్డం మీద చెయ్యివేసి వెనక్కునెట్టాడు. కత్తి నిలువునా పెట్టి, అడ్డంగా తిప్పి, ఏటవాలుగా లాగి, నిలువుగా ఒత్తి నిట్టూరుస్తూ లేచి, వణుకుతూ వీరన్న ముఖంలోకి చూచి అన్నాడు "అయ్యిపోయింది".

కథ చివరిలోని ఈ వాక్యాల వల్ల వీరన్నను నాగలింగం చంపివేసినట్టు ధ్వనిస్తుంది. కాని మరోవైపు చూస్తే వృత్తిదారుడు క్షవరం చేయటం అనే తన పనిని పూర్తి చేసినట్టు ధ్వనిస్తోంది. కథ పేరు తలలేనోడు అన్నప్పుడు తనకు అంత అన్యాయం చేసిన వీరన్న తల నాగలింగం చేతిలో ఉన్నా, చేతిలో పదునైన ఆయుధం ఉన్నా ఏమీ చెయ్యలేని చైతన్యరాహిత్య స్థితి, ఈ వృత్తికులాల్లో నరనరాన జీర్ణించుకుపోయిందని సూచించినట్లైంది. మరో కోణంలో తలలేనోడు అనే శీర్షిక వీరన్ననుద్దేశించినట్లుగా చూడాలి. నాగలింగానికి ఇంత ఘోరమైన అన్యాయం చేసికూడా వీరన్న తన తల ఆయుధమున్న నాగలింగం చేతిలో పెట్టాడంటే నిజంగా వీరన్న తలలేనోడు అని సూచించినట్లవుతుంది. స్నేహితుడిలానటించి, మోసంతో ఆస్తి కాజేసి నాగలింగంతో క్షౌరం చేయించుకున్నాడు వీరన్న. అంటే దోపిడీకి గురియై పగతో ఉడికిపోతున్న నాగలింగానికి చేతినిండా దొరికినట్లైంది వీరన్న కేసి చూస్తూ 'అయిపోయ్యింది' అన్నాడు కనుక వీరన్న చావలేదు అని వాదించటం సరికాదు. గొంతుదాకా కత్తివచ్చినాక గొంతుచూస్తూ అయిపోయింది అనాలే కాని, వీరన్నకేసి చూశాడంటే కత్తి వీరన్న గొంతు పనిచూసిందనే అర్థం. 'ఒక కీలక బిందువు దగ్గర కథ ముగించటం మంచి రచనాకళ. రచయిత ఇంకేదో చెబుతాడని ఆశిస్తున్న సమయంలో ఆ కథ ఆగిపోతుంది. నిజానికి అక్కడ ఇంకొక్క వాక్యం తగిలించినా కథ సౌందర్యం దెబ్బతింటుంది' అంటారు. డా॥ పాపినేని శివశంకర్.

'అడపం' తుమ్మల రామకృష్ణ రచన. వస్తుశిల్ప సమన్వయం సాధించింది. మొగిలప్ప 'అనకవ మనకవ' కలిగిన క్షురకుడు. "ఎత్తిన కత్తి దించకుండా ఎండనెత్తిమీద కొచ్చేంతవరకు అలుపు సొలుపు లేకుండా గెడ్డాలు గీసే మొగిలప్పకు 'ఇరవై గుంటల మడిఎకరం' చేను ఉంటుంది. మొగిలప్ప తన కొడుకును వ్యవసాయదారుణ్ణి చెయ్యాలని కులవృత్తికి దూరంగా ఉంచేస్తాడు. మొగిలప్ప పొలందున్నే రోజు, చెయ్యటానికి రాలేదని మోతుబరి నర్సయ్య పక్క ఊరి మంగలిని పిలిపించుకుంటాడు. తనను ఎదురించి సొంత వ్యవసాయం చెయ్యటంలోనే మొగిలప్ప తెగువను గుర్తించిన నరసయ్య, ఇంటికి పిలిచి మొగిలప్పను బూతులు తిడతాడు. తన కూతురు పెళ్ళికి పట్నం నుంచి బేండుమేళం పిలిపించుకుంటాడు. "ఇంటిపనోడు" ఉన్నాడని కూడా తలచడు. "మొగిలప్ప విసురుగా సంకనున్న అడపం సంచి తీసి పక్కనే ఉన్న కాలువలోకి సత్తువకొద్ది విసిరేశాడు" మంగలి వృత్తికి పల్లెప్రాంతాల్లో ఎంత తేలిక భావం ఉందో, అదే భూమిపై పట్టువున్న రైతుకు ఎలాంటి గౌరవ స్థానం ఉందో తెలియచెప్పే కథ.

**"అతడు బయల్దేరాడు"** రాప్తాడు గోపాలకృష్ణ కథ 'అతడు బయల్దేరాడు'. కథాక్షేత్రం రాయలసీమగా చూపినా దేశమంతా అన్వయించుకోదగిన కథ. ఈ కులంలో రెండుతరాలు 'ఆత్మగౌరవం' అనే అంశాన్ని ఎలా కోరుకుంటున్నది, పరిస్థితి భిన్నంగా ఉన్నప్పుడు ఎలా ఎదుర్కొంటున్నది చిత్రించిన కథ. ఆ ఊరికి ఒకడే క్షురకుడు నాగన్న. ఊళ్ళో రెండు వర్గాలుగా రెడ్లు విడిపోయి పార్టీలు కట్టుకున్నారు. నాగన్న మాత్రం పచ్చిగడ్డివేస్తే భగ్గుమనే రెండు వర్గాలకు ఒకే కత్తితో క్షౌరం చేశాడు. ఇదే నాగన్న అణకువకు నిదర్శనం. నాగన్నకు కొడుకు, కూతురు. కొడుకును

---

**గత పన్నెండేళ్ళ కథని ఆ సమయంలో సందోర్భోచితంగా గుర్తుచేస్తూ మొత్తం సంఘటనని శిల్పభరితం చేశాడు రచయిత. "తలముందు జుత్తు అంతా గీసేసింది కత్తి. అక్కడక్కడా మిగిలిపోయిన వెంట్రుక మొనలు అద్దం మీద పడ్డ నల్ల దుమ్ములాగా ఉన్నాయి. చూపుడు వ్రేలు, బొటనవ్రేలు మధ్య కత్తి రెండెడ్ల మధ్య నాగలిలా శిరక్షేత్రం దున్నుకుపోతూ ఉంది. వెనక్కి ముందుకు, క్రిందికీ పైకీ" ఇలా మొత్తం కథ వృత్తి పనితనాన్ని అద్దం పట్టి చూపుతుంది.**

---

**శూద్రవర్ణంలోనే సేవక వృత్తి కులంగా మంగలి కులం ఉన్నది. శూద్రవర్ణానికి చెందిన సేవక కులాలు తమ సేవలు నాలుగు వర్ణాలకే వినియోగించాలనే నిబంధన ప్రకారం దళితులకు వృత్తి చేయటం నిరాకరించినట్లైంది. ఫలితంగా వస్త్ర శుభ్రత, క్షౌర విధి దళితులు తమలో తామే చేసుకోవలసి వచ్చింది. దళితుల్ని తాకటం వల్ల అంటు ఏర్పడి అది వృత్తి కులాల వారి ద్వారా అగ్రవర్ణ సమాజానికి వ్యాపిస్తుందనే దురాలోచనకు ఈ నిబంధన రూపం అవుతుంది.**

హాస్టల్లో చదివించాడు. ఉద్యోగస్తుడై, విద్యావంతురాలిని పెళ్ళాడి పట్నంలో కాపురం పెట్టాడు. కులం కారణంగా అద్దె యిల్లు దొరకని పరిస్థితిలో అతని భార్య 'కమ్మోల్ల' మని చెప్పి అద్దె యింట్లో దిగుతారు. తాము చెప్పిన అబద్ధంతో తమ సంస్కృతిని, స్వభావాన్ని, సర్వస్వాన్ని మార్చుకోవలసి వస్తుంది. జీవన విధానంలోని అన్ని మార్గాల్లోను నటించాల్సి వస్తుంది. మూలం నుంచి తను వేరై ఆత్మగౌరవం చంపుకొని పరాయిగా బతకటం, తన కట్టుబొట్టు ఆచార వ్యవహారాలు మార్చుకోవలసి రావటం, అతి జాగ్రత్తగా బంధువులకు దూరం కావటం, ఎవరో తనపై నిఘా పెట్టినట్టు అభద్రతకు గురికావటం, చివరికి పండక్కి తన సొంత ఊరు వెళ్ళి తన తల్లిదండ్రులను కూడా కలుసుకోలేని దుస్థితికి చింతిస్తాడు. ఈ అంతర్మథనంతో సంఘర్షణకు లోనై చివరికి తనను తాను తెలుసుకొని పల్లెబాట పట్టటంతో కథ ముగుస్తుంది. తరతరాలుగా ఆత్మన్యూనతకు, అణచివేతకు గురియవుతున్న వృత్తి వర్గాలలో విద్యావంతులకు కళ్ళు తెరిపించే కథ ఇది. కులం పేరు చెప్పుకోవటానికి సిగ్గుపడే దళిత బహుజన కులాల ఉద్యోగులు, విద్యావంతులు, అధికారులు, వ్యాపారులు మాదిగ ఆత్మగౌరవ పోరాటం సాధించిన సామాజిక చైతన్యం అధ్యయనం చెయ్యాలి. వ్యతిరేక పరిస్థితుల్లో బతుకు మొదలుపెట్టి జీవితాల్ని గెలుచుకున్న ఈ వర్గాలకు చెందిన మేధావుల వారసత్వాన్ని నిలబెట్టి చాటాలి.

'గుండె చప్పుళ్ళు' పల్లెల్లో కులవృత్తులకు నిరాదరణ కారణంగా పట్నాలకు వలసపోవటం, అదే వృత్తిలో అక్కడ దినకూలీలుగా బతకటం, అక్కడ కూడా బతకటం కష్టమై అర్థాకలితో అలమటించి, చివరికీ హేయమైన పనులకు ఒడికట్టవలసి రావటం కనిపిస్తుంది 'ఐతా చంద్రయ్య' కథ 'గుండె చప్పుళ్ళు' (నవ్య వీక్లీ 12.05.2004)లో. సత్తయ్యకు భార్య ముగ్గురు ఆడపిల్లలు. "చాయ్ తాగేందుకు కూడా ఆటోలల్ల పట్నమొచ్చిపోతున్న పల్లెటూరి జనాలు షేవింగ్స్, కటింగులు ఊళ్ళో చేయించుకుంటలేరు". కాబట్టి సత్తయ్య ఇల్లు అమ్మేస్తాడు. భార్య నిర్వేదంతో మరణిస్తుంది. తాగుబోతవుతాడు. అప్పులు చేస్తాడు. బాకీలు తీర్చటం కోసం పెద్ద కూతురును బొంబాయిలో అమ్మేస్తాడు. బాకీలు తీరక దినకూలీగా యాదగిరి షాపులో కుదురుతాడు. రెండో కూతుర్ని కూడా బోంబేలో అమ్మేస్తే వచ్చే డబ్బుతో బాకీలు తీర్చి చిన్నకూతురు భవానికి పెళ్ళి చెయ్యవచ్చు అనుకుంటాడు. మానవత్వంగల యాదగిరి భవానిని కలిసి మనువాడుతాడు. సత్తయ్యకు కనువిప్పు కలిగిస్తాడు. అసమర్థతకు దుర్వ్యసనాలు తోడైతే జీవితం ఎలా పతనమవుతుందో ఒకవైపు కనిపిస్తున్నా, మరోవైపు హృదయ సంస్కారంతో అదే జీవితాన్ని ఎలా అర్థవంతం చేయవచ్చో రచయిత న్యాయంగా నిరూపిస్తున్న కథ ఇది.

**'అడివోడు'** రాయలసీమ ప్రాంతంలోని ఓ మారుమూల క్షురకుని కథ శ్రీనివాసమూర్తి రచన 'అడివోడు' (ఆదివారం ఆంధ్రజ్యోతి 09.06.1996) గూని మాదన్న పల్లె మంగలి. నిజానికతనికి గూని లేకపోయినా ముఖం వెడల్పుగా ఉండి, గిడస మనిషి అవటంలో గూని మాదన్న అయ్యాడు. పల్లెల్లో బడుగుజనానికి ఇవే సంకేతాలు మాదన్నకు 'నేస్తుడు' అడవోడు. అడివోడు అనేది ఆ పల్లె పెట్టిన పేరు. తల్లిదండ్రులు చిన్నప్పుడే మరణించటంతో అనాథ అయిన అడివోడుకి మాదన్న దంపతులు ఆలనా పాలనా చూశారు. బడిలో 'ఉప్పరి కృష్ణ' అనే పేరుతో నమోదు కాబడిన అడివోడు ఏ పనిలోనైనా గురి కలిగి ఉండేవాడు. కరెంటు పని నేర్చుకుంటాడు. ట్రాక్టరు నడుపుతాడు. చెక్కపనిలో, కమ్మరంలో నేర్పరి. పల్లెలో ఉండే వృత్తి నిపుణులకు మంచి ఉదాహరణ అడివోడు.

ఆ ఊరు కాపులు రెడ్లు ఒక వర్గంగా, మాదిగలు మరో వర్గంగా చీలి ఉంటుంది మాదన్న అగ్రవర్గాలకే క్షౌరం చెయ్యాలి. దళితులకు చెయ్యరాదనే నిబంధనను అధిగమించుతాడు మాదన్న. గ్రామ పెద్దలంతా కచేరి దగ్గరకు పిలిపించి మాదన్నను చివాట్లు పెట్టి అవమానిస్తారు. ఇదంతా మౌనంగా చూస్తున్న అడివోడు మాదన్న పనితనం గమనించి క్షౌర వృత్తి నేర్చుకుంటాడు. తానే స్వయంగా చెక్కతో కుర్చీచేసి బడ్డీకొట్టు పెడతాడు. మాదన్న ఇంట్లో ఉన్న పనిముట్లు తెచ్చి తొలి క్షౌరం మాదన్నకు చేస్తాడు. నేస్తుడు మాదన్న కోసం అడివోడు మంగలి షాపు పెట్టాడని ఊరు చర్చించుకుంటుంది. మాదన్న మందలించినా అడివోడు వినడు. "ఊరి కట్టుబాటు నీకు మంగలోనికి. ఉప్పరోన్ని నాకేంటి" అని పల్లె కట్టుబాటును విచ్ఛిన్నం చేస్తాడు. వృత్తిని ఉపాధి మార్గంగా చూడకుండా కులం అంటు కట్టటంతో తమకంటే తక్కువ వారికి వృత్తిపని చెయ్యరాదనే సంప్రదాయాన్ని వర్గ స్పృహతో తిప్పి కొట్టిన కథ ఇది.

ఇది మౌలికమైన అంశాల్ని లేవనెత్తిన కథ. చరిత్రను అధ్యయనం చేసినప్పుడు, కాపు, రెడ్డి కులాల, పాలక స్వభావం కలిగిన సంపన్న శూద్ర వర్ణానికి చెందినవి. శూద్రవర్ణంలోనే సేవక వృత్తి కులంగా మంగలి కులం ఉన్నది. శూద్రవర్ణానికి చెందిన సేవక కులాలు తమ సేవలు నాలుగు వర్ణాలకే వినియోగించాలనే నిబంధన ప్రకారం దళితులకు వృత్తి చేయటం

నిరాకరించినట్లైంది. ఫలితంగా వస్త్ర శుభ్రత, క్షౌర విధి దళితులు తమలో తామే చేసుకోవలసి వచ్చింది. దళితుల్ని తాకటం వల్ల అంటు ఏర్పడి అది వృత్తి కులాల వారి ద్వారా అగ్రవర్ణ సమాజానికి వ్యాపిస్తుందనే దురాలోచనకు ఈ నిబంధన రూపం అవుతుంది. భూస్వాముల ఇళ్ళల్లో కొన్ని సందర్భాల్లో పశువులకు సైతం వెంట్రుకలు కత్తిరించిన క్షురకులుదళితుడైనంత మాత్రాన సాటి మనిషిని దరిచేరనీయక పోవటం లోని ఔచిత్యాన్ని ప్రశ్నిస్తుందీ కథ. చరిత్రలో మాదిగ ఉత్పత్తుల్ని క్షౌర వృత్తిదారులు వినియోగించుకున్నారు. క్షురకులు, తమ కత్తికి పదును పెట్టటం కోసం తాడించటానికి ఉపయోగించే 'లీడు తోలు'ని తమ వృత్తి పరికరాల్ని భద్రం చేసుకోవటానికి తోలుసంచి'ని విరివిగా వాడుకోవటం జరిగింది (నాగప్ప గారి సుందరరాజు వ్యాసం - దళిత బహుజనులు - మానవ సంబంధాలు - చూపు - జులై ఆగస్టు 1996). ఈ కథలో సమస్య పరిష్కరించటానికి రచయిత ఎత్తుగడతో సాంకేతికంగా 'ఉప్పరి కృష్ణ'ను సృష్టించారు. ఆ ఊళ్ళో దళితులు బలమైన వర్గంగా నిలబడి అగ్రవర్ణ శూద్ర కులాలను నిలువరించే స్థాయిలో ఉన్నప్పుడు, వర్గచైతన్యంతో మాదన్నను వారివైపుకు నడిపి ఉంటే కథకు దృక్పథం వచ్చి ఉండేది.

**'రాలినచింత'** – డా॥ తుమ్మల రామకృష్ణ రచన 'రాలిన చింత' బడుగు బలహీన వర్గాల ఐక్యత నుద్దేశించింది. పల్లెలో పోరంబోకు స్థలంలో ఉన్న రెండు చింతమాన్లు రెండు కులాల్ని వేరు చేయటం జరుగుతుంది. మంగలిరామన్న, మాలమునెప్పలు రెండు కులాల ప్రతినిధులు. ఇరువర్గాలు చింతమాన్లు మాకంటె మాకు చెందుతాయని ఘర్షణ పడతారు. మాల యువకులకు నాటకాలు నేర్పే వెంకటస్వామి ఇరువర్గాల్ని సముదాయిస్తాడు.

చింతమానులున్న పోరంబోకు స్థలాన్ని పట్టా చేయించుకోవాలనే తలంపుతో కరణం సొంత మిల్లులో మునెప్ప, పశువుల కాపరిగా మునెప్ప కొడుకు పనిచేస్తారు. అదే ఉద్దేశ్యంతో రామన్న నిత్యం కరణానికి క్షౌరం చేస్తుంటాడు. కరణం ఈ సమస్య పరిష్కరించకుండా సాగదీస్తుంటాడు. పైగా ఇరువర్గాలు పోటీపడి సేవలు చేయటంతో కాలయాపన గొప్ప పరిష్కారం అనుకుంటాడు. ఇదంతా వాళ్ళు గుర్తెరిగేలా వెంకటస్వామి తెలియచెపుతాడు. ఇద్దరు కరణం బుద్ధిని గ్రహిస్తారు. పరిష్కారంగా ఎవరింటివైపు ఉన్న చింతమానుపై ఫలసాయం వారే అనుభవించాలని నిర్ణయించుకుంటారు. మరెవరైనా చితమానుపై చెయ్యివేస్తే చింతకాయల్లా రాలిపోవాలని తీర్మానించుకుంటారు. ఇద్దరు కరణం దగ్గర పనిమానేస్తారు. పాలకవర్గాలు బడుగు జనాల్ని విడదీసే విధానం దాన్ని అధిగమించి ఐక్యత సాధిస్తే రాజ్యాధికారం తమదే అనీ ధ్వనిమంతంగా రుజువు చేస్తుందీ కథ.

**'అద్దాలనాడు'** – 'అద్దాలనాడు పిల్లలు గాని, గద్దాలనాడు కాదు' అనే నానుడికి తగిన కథ ఇది. రచయిత డా॥ కాలువ మల్లయ్య (ఆంధ్ర సచిత్ర వారపత్రిక – 14.06.1985). పల్లెలో క్షురకుడు గౌరయ్యకు భార్య లసుమమ్మ. ముగ్గురు ఆడపిల్లలు. ఒక మగ సంతానం. కొత్తదనం కోసం కొడుక్కి 'వినోద్' అని పేరు పెట్టాడు గౌరయ్య. "కట్టబడి సదివిత్తె ఆడు నీతల పుండ్లు కడుగుతా దార. సదువుకున్నోన్ని నమ్మదు. అటెనక రెక్కలున్న పచ్చోలె ఎగిరిపోతే గప్పుడుగని ఏర్పడతది పైసలేవేం పో" అని గర్జించిన రామిరెడ్డిని సైతం ఒప్పించి అప్పుచేసి వినోద్‌ని చదివించాడు. ముగ్గురు ఆడపిల్లలను వృత్తిదారులకిచ్చి పెళ్ళి చేశాడు. వినోద్ పట్నంలో చదువుకొని ఇంజనీరు అవుతాడు. తల్లిదండ్రులకు తెలియకుండా ప్రేమ వివాహం చేసుకొని వేరు కాపురం పెడతాడు. గౌరయ్య ఆవేదన చెందుతాడు. తల్లిదండ్రుల బాగోగుల ఏమాత్రం పట్టించుకోకుండా నిజంగానే రెక్కలొచ్చిన పక్షిలా ఎగిరిపోయినట్టుంటుంది. ఒకరోజు తన చదువుల కోసం చేసిన బాకీలు తీర్చాలని పట్నంలో కొడుకు ఇంటికెళ్ళతాడు. గౌరయ్య తన తండ్రి అని లోకానికి తెలియటం చిన్నతనంగా భావించి తండ్రిని బయటకు వెళ్ళనివ్వడు వినోద్. తాను గౌరయ్య కొడుకుగా తెలియటం అగౌరవంగా భావించి వినోద్ పల్లెకూ వెళ్ళడు. వృద్ధులైన గౌరయ్య దంపతులు అంతిమ స్థితిలో కూడా శరీరకష్టం చేసుకుంటూ బాధాకరంగా జీవితం వెళ్ళదీస్తారు. చదువులేకున్నా సామాజిక చైతన్యంతో ఉన్నతుడైన వృత్తిదారుడు ఒకవైపు కనిపిస్తుంటే, విద్యావంతుడై మానవీయత కోల్పోయి తిరోగమిస్తున్న వ్యక్తిత్వాన్ని చిత్రించిన కథ ఇది.

పైన పేర్కొన కథలు వస్తుపరంగా, దేనికదిగా ప్రత్యేక ప్రయోజన దృష్టిని కలిగి వున్నాయి. పల్లెల్లో మోతుబరులు చిన్నకులాలపై చేస్తున్న దాడులు మోసాలు వెనుక ఆర్థిక నేపథ్యంతో పాటు, సామాజిక దురహంకారం దాగి వున్నాయని 'తలలేనోడు' నిరూపిస్తుంది. తమ ఉనికిని కాపాడుకుని వృద్ధి చెందాలంటే సేవకకులాలు 'స్థిరాస్థి'పై పట్టు కలిగి వుండాలని 'అడపం' లోను, ఎంత చదువుకున్నా కులం కారణంగా తక్కుగా చూడబడటం అల్ప సంఖ్యాక, అణగారిన వర్గాల అభద్రతా భావన "అతడు బయల్దేరాడు" లోను కనిపిస్తుంది. సమాజం పోకడ గుర్తించక కుటుంబాన్ని దుర్భర పరిస్థితుల్లోకి నెట్టుతున్న వృత్తిదారుణ్ణి ఆదుకుని మానవత్వమే అన్నిటికీ మూలమని నిరూపించిన కథ 'గుండెచప్పుళ్ళు'. ఎప్పటికైనా సమాజం సమానం కావాలంటే వర్గదృష్టితోనే పోరాడాలని విశ్లేషించిన కథలు 'అడివోడు' 'రాలినచింత' కాగా, స్వభావంలో మార్పు రాకుంటే చదువు సంస్కారాన్నివ్వదని, అలాంటి కొడుకు కుటుంబాన్ని కబళిస్తారని 'అద్దాలనాడు' హెచ్చరిస్తుంది.

క్షౌరవృత్తిపై ఇంకా బాలకృష్ణమూర్తి భజంత్రీ కథలు, పంజాల జగన్నాథం 'లోగుట్టు', అల్లం శేషగిరి రావు 'శ్రీ కనక మహాలక్ష్మి హెయిర్ కట్టింగ్ సెలూన్', సెద్దింటి అశోక్ కుమార్ 'తెగిన బంధాలు', ఉప్పల నరసింహం 'నాయనమ్మనాడి' మొదలైనవి మంచి రచనలు.



# మృతిలేనివి

బొమ్మరాత యల్లయ్య
9502051996



నా ఊరి పొలిమేరల కొచ్చినప్పుడల్లా
స్మృతుల పరిమళాలు నన్నావహిస్తాయి
బాల్యంలోకి చటుక్కున లాక్కెళ్ళి
నన్నక్కడ బంధిస్తాయి
'అక్షరజ్ఞానం' అందించిన బడిని చూస్తుంటే
గోడ కుర్చీవేయించిన తెలుగు మాష్టారూ
లెక్కతప్పినందుకు లెంపలు వాయించిన
లెక్కల మాష్టారు గుర్తొస్తారు
అసంకల్పితంగా నా అరచేతుల్ని చూసుకుంటాను
నాచేతే బెత్తం తెప్పించి వాతలుపెట్టిన
సైన్స్ మాష్టారే కాదు -
వారు వెలిగించిన 'జ్ఞానజ్యోతి' స్ఫురిస్తుంది
చప్రాసీ మోగించిన 'బడిగంట'
ఇంకా 'రింగు'మంటూనే 'ఉంది' 'గుడిగంట'
చిటుక్కున మాచిట్టి చేతుల్ని గుచ్చుతూనే
గుప్పెడు పళ్ళిచ్చిన ఆరేగుచెట్టూ...
ఏడాది పొడుగునా నోరూరించిన చింతచెట్టూ
నేడుకా(చే) తలుడిగి విల్పుంటే మనసు
సూరుమంటుంది
కొల్లేరులో వచ్చీరాని ఈతలు కొట్టి
సరదా సంతోషాల్ని సంచుల్నిండా పట్టుకెళ్ళే వాళ్ళం
బురద బట్టల్ని ఉతుకుతూ అమ్మతిట్టినా
ఆమట్టి పరిమళాల్ని మనసారా ఆస్వాదించేవాళ్ళం
ఈ అనంతకాల చక్రభ్రమణంలో -
జ్ఞానం పంచిన గురువులు సైతం మృతులౌతారు
పసందైన పళ్ళనిచ్చిన ఆ చెట్లూ మరణిస్తాయి
చల్లని కొల్లేరూ భళ్ళున ఎండిపోతుంది
కొన్నేళ్ళకైనా బడి కూడా శిధిలమౌతుంది
కానీ...
ఎన్నాళ్ళైనా మృతిలేనివి తీయని నా 'స్మృతులే'.

---

# కొత్త శక్తిగా

- సిరిసిల్లా గఫూర్ శిక్షక్
9849062038

ఏ బాధైనా, ఏ రాత్రైనా
ఓర్చే హృదయం, రాసేహస్తం
మొగ్గలారనిప్రాయం
కాసుల కోసం కసాయితనానికి
బలిపీఠమెక్కించె కన్నప్రేగును
మంచి రాత పేరిట
కండ్లల్లో కాంతి నింపి
ఆశల వెలుగు ఒళ్ళంతా కప్పి
చేతులు మారిన డబ్బులతో
మర్మం తెలియని మాయమాటతో
కన్న ప్రేగునే ఆమ్మేసుకుని
సాగనంపేటి బీద బతుకు.
అవకాశానికి ఎరగా
కబళించేందుకు కసిగా
మొగ్గను నులిపే రాక్షస చేతులు
మారిన చేతుకు భరోసా ఇస్తూ....
ఆడజన్మకూ ఎన్ని పాట్లు
వేటాడు సమాజ బాణాల ఎన్ని వేట్లు
నరక ప్రయాణం ప్రారంభిస్తూ
నమ్మిన హస్తం చిదిమేస్తుంటే
కలల మొగ్గల్ని తుంచేస్తుంటే
ఆర్తనాదపు కేకలతోనే
కాళరాత్రులు కన్ను మూసాయి
కార్చిన కన్నీరే
గాయాల ఉతుకులకు నీరందించాయి
ప్రతి కన్ను కామత్వపు చూపులో
సమాజ నిర్భాగ్యత కనిపిస్తుంటే
రేయి మారుతూ, గూడు మారుతుంది
కసాయి కరెన్సీ రూపు మారుతూ
పెంటగ మారిన ఒళ్ళు కూలుతున్నది
కార్చిన కన్నీటినే మళ్ళీ మళ్ళీ తాగేస్తున్నది
జన్మనిచ్చిన హృదయాల
నిస్సహాయత తలుచుకుంటు
అదిగదిగో
కన్నప్రేగులో వివక్ష చూపే
కర్కశ సమాజ సాక్షిగా
వాలేటి పొద్దు సాక్షిగా
కాలరాసేటి భవిత సాక్షిగా
అదిగదిగో ఆమె



అస్తమిస్తున్నది
కోటి కాంతులతో
సరికొత్త శక్తిగా
మళ్ళీ ఉదయించడానికి

# దళిత, బహుజన స్త్రీల జీవితచిత్రణ - సిద్ధి నవల

- చింతనూరి కృష్ణమూర్తి
9705031007




వేముల ఎల్లయ్య నవలలు ఊహల్లోంచి, భ్రమల్లోంచి, రెండో శ్రేణి ఆలోచన నుండి పుట్టినవి కాదు. అచ్చమైన దళిత జీవితం నుండి ఆవిర్భవించాయి. ఎల్లయ్య గారు నల్లగొండ జిల్లా దళిత కుటుంబంలోంచి వచ్చినవాడు, సాహిత్య నేపథ్యం, ప్రాబల్య సాంస్కృతిక నేపథ్యం నుండి వచ్చినవాడు కాదు. తన స్వీయానుభవాన్ని, తాను విన్న కన్న జీవితాలని దళితేతివృత్తాలుగా మలిచాడు. ఆయన రాసిన మొదటి నవల 'కక్క' (2000) రెండవది సిద్ధి (2005).

తెలుగు నవల పుట్టి నూటయాబై ఏళ్ళు అయ్యింది. ఎంతో వస్తు వైవిధ్యంతో విలసిల్లిన తెలుగు నవల ఒకానొక కాలంలో వ్యాపారాత్మక కావడం నవలా వికాసానికి గొడ్డలిపెట్టు. చరిత్ర అన్నప్పుడు ఎగుడు దిగుళ్ళుంటాయి. అట్లాగే నవలా చరిత్రలో కూడా అప్పుడప్పుడు ఇలాంటి పరిస్థితి ఉంది. సంస్కరణ, అభ్యుదయ, విప్లవ దశల్లో వచ్చిన నవలా సాహిత్యం సామాజిక ప్రయోజనంతో వచ్చిందే. ఆ తరువాత రెండు దశాబ్దాలు వ్యాపార నవలలు వచ్చి మానవీయ విలువలకు విఘాతం కలిగించాయి. మనుషుల బలహీనతలను రెచ్చగొట్టె నవలలు కూడా కొంతకాలం సాహితీ క్షేత్రంలో కలుపు మొక్కలుగా పెరిగాయి. సమాజం తన అవసరాల కోసం కావాల్సిన సాహిత్యం సృష్టించుకొంటుంది. అట్లా కాలమే సృష్టించుకున్న సాహిత్యమే దళిత సాహిత్యం. దళిత జీవితాన్ని, సంస్కృతిని అపూర్వంగా చిత్రించిన నవలలు తొంబయ్యోదశకం నుండే వచ్చాయి. ఈ క్రమంలో వచ్చిన నవల "సిద్ధి".

వేముల ఎల్లయ్య నవలలు ఊహల్లోంచి, భ్రమల్లోంచి, రెండో శ్రేణి ఆలోచన నుండి పుట్టినవి కాదు. అచ్చమైన దళిత జీవితం నుండి ఆవిర్భవించాయి. ఎల్లయ్య గారు నల్లగొండ జిల్లా దళిత కుటుంబంలోంచి వచ్చినవాడు, సాహిత్య నేపథ్యం, ప్రాబల్య సాంస్కృతిక నేపథ్యం నుండి వచ్చినవాడు కాదు. తన స్వీయానుభవాన్ని, తాను విన్న కన్న జీవితాలని దళితేతివృత్తాలుగా మలిచాడు. ఆయన రాసిన మొదటి నవల 'కక్క' (2000) రెండవది సిద్ధి (2005).

గ్రామీణ సమాజంలో దళిత స్త్రీ ఏ విధంగా అణచివేయబడుతుందో, భార్యగా, తల్లిగా, సమాజంలో సంచరించే వ్యక్తిగా ఆమె పాత్ర ఎలాంటిదో సిద్ధి నవలలో రచయిత కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు. సమస్యలు ఎదురైనప్పుడు దళిత స్త్రీ సాహసంతో వాటిని ఎట్లా ఎదుర్కొంటుందో ఈ నవలలో కన్పిస్తుంది. దొరల వలన తలెత్తే సమస్యలను పురుషుల కంటే ధీటుగా స్త్రీ ఎదుర్కొనే పద్ధతి ఈ నవలలో వాస్తవికంగా చిత్రించాడు రచయిత. దళిత, బహుజన స్త్రీలు అగ్రకులం స్త్రీలలాగా పురుషుడి ఆధిక్యానికి లోనుకాకుండా, ప్రశ్నించే తత్వం ఎలా ఉంటుందో రచయిత కళ్ళకు కట్టినట్లు దీనిలో చూపారు.

ఈ నవలలో 'సిద్ధి' ప్రధాన పాత్ర. సిద్ధితో పాటు సాలవ్వ, రామవ్వ, మల్లక్క, మంగళ్ళోళ్ల పిల్లలాంటి స్త్రీ పాత్రలు ఎంతో చైతన్యంతో కన్పిస్తాయి.

సిద్ధి తల్లి సాలవ్వ అల్లుని ఇంటికి వచ్చి కూతురు పరిస్థితిని చూసి బాధపడి ఎన్నో అబద్ధాలు ఆడి పాపయ్య నిన్ను పెళ్ళి చేసుకున్నాడని సిద్ధితో చెప్పుతూ అల్లుడైన పాపయ్యను వదులుకొని తల్లిగారింటికి రమ్మంటుంది.

"ఎన్ని దినాలు నెగులుతవు జెప్పు నీకు దగ్గోడు దొర్కడా?

కాళ్ళు కాళ్ళు గట్టుకొని ఎంకులాడుకొత్త" (సిద్ధి పేజీ - 6) అనగానే సిద్ధి గుండె నిబ్బరంతో నాకు ఏ విధంగా రాసుంటే ఆ విధంగా జర్గుతదని అవసరమైనప్పుడు నేను దేనికైన సిద్ధమే అని చెప్పుతూ "ఓ అమ్మా! ఊకోయె. ఈర్వెనతోటి నెత్తి ఈర్సి సిగముడువు. నాకట్టం ఎట్టనన్నబద్త" (సిద్ధి పేజి. 6) అని తల్లిని ఓదార్చడంలో తెలంగాణ ప్రాంత గ్రామీణ దళిత స్త్రీ కూతురుగా ఏ విధంగా ఉంటుందో సిద్ధి మనకు ఈ నవలలో

ఆ విధంగా కనపడుతుంది.

సిద్ధి అక్క రామవ్వపుట్టుకతోనే గుడ్డిది. రామవ్వ, సిద్ధి కవలపిల్లలు. తనకంటే చిన్నదైన సిద్ధికి వివాహం జరిగినా తను జీవితంపై విరక్తి నొందక ఎన్నో కష్టాలను ఎదుర్కొంటూ జీవించే పాత్రగా రామవ్వ మనకు కనబడుతుంది.

జనగాం రైల్వేస్టేషన్‌లో చిల్లర డబ్బులు అడుక్కుంటూ జీవనం సాగించే రామవ్వకి మరిది వరుస ఐన వాడితో పెళ్ళి జరుగుతుంది. వాడు రామవ్వ గుడ్డిది కావడంతో ఆమెను సరిగా చూసుకోక ఆమె అడుక్కున్న పైసలు అన్ని గుంజుకొని రామవ్వని బాధిస్తాడు. అయినా రైల్వేస్టేషన్‌లో తనతో అడుక్కునే వారితో కలిసి జీవితాన్ని గడుపుతుంది. రమాతుల్లా, యాకమ్మతో కలసి రైల్వేస్టేషన్‌లో అడుక్కోవడానికి వెళ్ళుతూ" గీరైలెన్కన కిష్టల ఎకొక్కత్త ఒక్క యేడాది అద్దులు బైలెల్లినొల్లము ఏమాడుల కాలం జేసేదుందో ఏమో ఉంటమ్ కడుపుకు తినుండ్రి" (సిద్ధి పేజీ 13) అని యాకమ్మ చెప్పడంతో రైల్లో అడుక్కునే వారి జీవితం కళ్ళముందు నిలుస్తుంది. ఈ బాధలన్ని అనుభవిస్తున్న జీవితం రామవ్వది. అయినా జీవితంపై విరక్తినొందక తన రెక్కల కష్టంపై బతకడానికి నిశ్చయించుకున్న స్త్రీపాత్రగా రామవ్వను చూడవచ్చు.

సాలవ్వ, దొడ్డయ్యలు ఇద్దరు దంపతులు. వీరికి నలుగురు బిడ్డలు. పెద్దవారిద్దరికి పెళ్ళిళ్ళయ్యింది. మిగిలిన ఇద్దరిలో సిద్ధి, రామవ్వలు కవలలు. అల్లునింటికొచ్చిన సాలవ్వ కూతురుకు గతంలోని బాధల్ని చెప్పింది పెళ్ళి అయ్యాయి. తను దొడ్డయ్య ఇద్దరు కలసి తుమ్మ చెట్లు నరకడానికి కంచెలోకి కూలికి వెళ్తారు. అక్కడ ఎనబోతుల జంట ఎదపడినపుడు సాలవ్వ చూపించిన ధైర్యం ఎన్నదగినది. గర్భవతి అయిన ఒక దళిత స్త్రీ తుమ్మలు నరకడానికిపోవడం ఎదురుగా వచ్చిన ఎనబోతుల్ని చంపడం ద్వారా రచయిత సాలవ్వను తన భర్త దొడ్డయ్యకంటే ధైర్యవంతురాలిగా చిత్రించాడు. "ఎనబోతుల్ని సంపిన సాలవ్వ" దొడ్డయ్య ఓరి దొడ్డయ్య ఓ మొగాయ్న నీ ఆడిమొకమల్లసాడు. అడ్డి ఏడ్సినట్టే ఏడుస్తున్నవయ్య సిగ్గులేదు సినాలోడ ఏడుతన్నవయ్యా పిడాతమనల్ని సంపితే మంచి గుంటాదిపానం. ఊకోవ్ ఆడిమొకపోడా నా పీడవాయె సత్తెసచ్చిందిలే" (సిద్ధి పేజీ.9) అని దొడ్డయ్యను అనడంతో సాలవ్వ ధైర్యాన్ని మనం అర్థం చేసుకోవడానికి వీలైంది. అడవిలో దళిత స్త్రీ సమయస్ఫూర్తి అవసరమైనపుడు ఎంతకైనా తెగించే లక్షణాన్ని రచయిత మనకి సాలవ్వపాత్రలో చూపించాడు.

దళిత స్త్రీలే కాక బి.సి కులాలకు సంబంధించిన స్త్రీలు కూడా పురుషుల కంటే చైతన్యవంతులుగా మనకు ఈ నవల్లో కనపడుతుంది.

ఎడ్లసైదులు అనే వ్యవసాయదారుడు రాత్రి ఎడ్లను కొట్టుకొని వస్తుంటే గుండ్రాయి తగిలి కుంటిదొర గడిలో పడతాడు. దొరతనను కొడతాడని లేచి భయంతో పరుగెత్తుతున్నప్పుడు సైదుల్ని చూసి గ్రామస్తులు దొంగని వెంబడిస్తారు. ఆడవారు మొగవారు వేరువేరుగా వెళ్తారు. మల్లక్క మంగలోల్ల పిల్ల కలసిపోతుంటే మనిషి పొదలో పడి మూలుగుతుంటాడు.

"అమ్మా... అమ్మా... అని తల్లడిల్లుతున్న మనిషి ఎట్ల వొదిలిపెడదాం. రేపు నువ్వు గూడ కడుపు దెర్సికనిపించె దానివైతివి గుండెధైర్నం జేస్కోసెల్లె. దొంగని ఇనంగనే మనం మొగోళ్ళు ఆమెడదూరముర్కుతరు. నాకెర్కె." (సిద్ధి పేజి - 29) అని ఎంతో ధైర్యంతో ఇద్దరు చీరతో కావడికట్టి మూలుగుతున్న సాయిలును ఎత్తుకపోయిన తీరు బి.సి మహిళల చైతన్యాన్ని చాటిచెప్పుతుంది.

ఎడ్లసైదులనీ తెలిసిన తరువాత అతన్ని వదిలి ఎవరికి కనబడకుండా వెళ్ళమని చెప్పడం వారి ఉదారభావానికి అద్దం పడుతుంది. ఈ విధంగా దళిత స్త్రీలనేకాక బి.సి స్త్రీలు ధైర్యాన్ని కల్గి ఉండే విధానం నిజ జీవితంలో సజీవ పాత్రలుగా చిత్రించడం ఇది రచయిత గొప్పతనం.

కుంటిదొర ఇంటిలో సిద్ధి పనిచేస్తుంది. కోమటిసేటు ఇంట్లో పాపయ్య పనిచేస్తాడు. ఒకరోజు రాత్రి పాపయ్య తాగి కోమటి సేటు లేని సమయంలో ఇంట్లోకి వెళ్ళడం చేత వాడిపై సేటమ్మ, సేటు పంచాయతి పెట్టినపుడు ఆ ఊరు పెద్ద మనిషి కోనేటి రాజయ్యతో సిద్ధి మాట్లాడిన మాటలు సమాజంలో ఎంతో అనుభవాల్ని ఆర్జించి ముందు వెనక చూసుకుంటూ జాగ్రత్తగా మాట్లాడేదానిగా సిద్ధిమాటలు కనబడతాయి. ఏ విధంగానైనా ఈ పంచాయతి జరగకుండా చూడాలని భర్తపై జరిగే పంచాయతిని బోనాల పండుగదాకా ఆపాలనీ "వొర్సకు తాతవు నాకంటే నాద్గెండ్లు సిన్నోనివి అయిన వొర్సతప్పతలేను" (సిద్ధిపేజీ. 1) కోనేటి రాజయ్యకు చెప్పుతుంది.

తను దొడ్డయ్య ఇద్దరు కలసి తుమ్మ చెట్లు నరకడానికి కంచెలోకి కూలికి వెళ్తారు. అక్కడ ఎనబోతుల జంట ఎదపడినపుడు సాలవ్వ చూపించిన ధైర్యం ఎన్నదగినది. గర్భవతి అయిన ఒక దళిత స్త్రీ తుమ్మలు నరకడానికిపోవడం ఎదురుగా వచ్చిన ఎనబోతుల్ని చంపడం ద్వారా రచయిత సాలవ్వను తన భర్త దొడ్డయ్యకంటే ధైర్యవంతురాలిగా చిత్రించాడు.

కుంటిదొరకు ఎంతో సాకిరి చేస్తూనే అడవిలో బావికాడికిపోయి మొగోడిలా వ్యవసాయాన్ని చూసుకోవడం వల్ల సిద్ధి మగవారితో సమానంగా కనపడుతుంది. ఇంట, బయట అన్ని పనులు మీద వేసుకొని కుటుంబాన్ని మోయడం గ్రామీణ దళిత స్త్రీలలో కనబడుతుంది. ఈ విధంగా భార్యగా ఎంతో బాధ్యతగా వ్యవహరించడం ఈ నవల్లో ఉంటుంది.

ఈ నవలలో సిద్ధి తల్లిగా కూడా ఎంతో ఉన్నతంగా కనబడుతుంది. తన కొడుకు సైదులు బడికి వెళ్ళలేదని తెలిసిన తరువాత ఇంటి నుండి బయటకు వెళ్ళిన సైదులు ఎటువెళ్ళినాడోనని వెతికే సందర్భం తల్లిగా సిద్ధిని పరిపూర్ణం చేస్తుంది. చెప్పులు కడుతున్న పాపయ్యకు సైదులు బడికి పోలేదని తెలవడంతో "రోజు బడని ఇత్తిర్గ తినిపోతుండు. దుడ్డెపిల్లలెక్క ఆడైతే రానియ్యి ఎడ్లగోసే పని కత్తితోని పల్ల జీరుతకొడ్కును" (సిద్ధిపేజీ - 72) అని సైదుల్ని తిట్టడంతో పాపయ్య రాడని తెలిసి సిద్ధి" నా పోరన్ని నేదీస్కరాకపోతే నువ్వు దేవ్లాడుకొత్తావు?

## రెండు జతల చెప్పులు

హిందీ : ఆశీష్ నైథాని 'సలిల్'
అనువాదం : వేదుల రామకృష్ణ



గుమ్మం బయట
ఉంటుండేవి చక్కగా
ఐదు జతల చెప్పులు
కాలం ఒడిదుడుకులకు
చెల్లా చెదురయ్యారు
కుటుంబ సభ్యులు కూడా
చదువు, ఉద్యోగం, పెళ్ళిళ్ళు
కారణాలు ఎన్నో

ఇప్పుడు ఇంట్లో ఉంటున్నది ఒంటరిగా
ఇద్దరు, ముసలి తల్లి - తండ్రులు
జ్ఞాపకాలన్నిటిని మూట కట్టుకుని
గుమ్మం బయట మాత్రం
పడి ఉంటాయి
అస్తవ్యస్తంగా
రెండు జతల చెప్పులు

---

నాకు నమ్మికమే నువ్వంటే. నా పోరాన్ని నన్ను కంట్లె పెట్టుకుంటవేందిరా" (సిద్ధి పేజి. 72) అని తిట్టుకుంటువెళ్తుంది.

సాయంత్రం అయింది. ఎటువెళ్ళాడో అని కలిసిన వాళ్ళందరిని అడుగుతుంది. గొర్లకాడికిపోయే గొల్లాయన చీమసింత చెట్లల్లో కనబడినాడని అటువైపు పెంజరపాము ఉందని, అది గొర్రెపిల్ల కాళ్ళు పట్టుకుంటే గొడ్డలితో పెంజర పామును నరుకుతే గొర్రెకాలు తెగిందని కట్టెతో ఎంతకొట్టిన పాము చావడం లేదని చెప్పుతాడు గొల్ల. కొడుకు జాడ చెప్పమనగా ఆ గొల్ల" నీ మొగన్ని వెంట బెట్టుకొని రాక గీ అడ్విల నువ్వొక్క దాని వోత్తామ్మా! మనూరి దానివైతివి తెలివి తక్కువదానిలేందే లేకిముండ అయితాగు! వోరిబుడ్డోడా! ఓరా ! హెహే ఓరారేఎయేవ్" (సిద్ధి పేజీ - 74) అనగానే గొర్లకాసే గొల్లపిల్లోడు వచ్చాడు. వానిని అడగగా. బడికి వెళ్ళేపిల్లవాడు నాలుగైదు రోజుల నుండి ఇటువైపు తిరుగుతున్నాడని చెప్పుతాడు. పుస్తకాల సంచి బల్బు చెట్టుకు తగిలించి సీమచింతకాయలు తింటుండని చెప్పుతాడు. ఎంతో ధైర్యంతో సిద్ధి ముందుకు వెళ్ళుతుంది. "సీరె కొంగు నడుం బిర్రుగున్నది. ఏది అడ్డమొచ్చినా నాపిలగాని సాచ్చిగా పిస్కి సంపుతా" (సిద్ధి పేజీ - 75) అంటూ ధైర్యాన్ని కూడదీసుకొని పోషమ్మకు, గ్రామ దేవతలకు మొక్కుకుంటూ వెదుకుతుంది. పటేలు నర్సమ్మ కంచెలకు వచ్చింది. పటేలు నర్సమ్మ సచ్చి ఆ కంచెలనే వుంటుందని బయపడుతూనే ధైర్యాన్ని ప్రదర్శిస్తుంది సిద్ధి. "మొగజీతగాళ్ళ కబడ్డి ఆడిచ్చినవు. ఎట్ల జీవొచ్చిందో గని సచ్చినవు నర్సవ్వా" (సిద్ధి పేజీ - 76) అని సిద్ధి పలకడం ద్వారా చనిపోయిన నర్సవ్వ కూడా ధైర్యశాలియని అర్థమౌతుంది.

ఈ చనిపోయిన నర్సమ్మను సిద్ధి నీవు దయ్యమై పిలుస్తే పలుకుతావని, పిసినారి మొకపుదానివని బయపడుతూ తిడుతుంది. దిక్కులేనోళ్ళకు దేవుడే దిక్కని తొమ్మిది నెలలు మోసి పదహారేండ్ల వానిని చేశానని సైదులు గురించి బాధపడుతూ వెళ్తుంటే పెంజరతోకపై కాలుపడడంతో సిద్ధి మొత్తుకోవడం మళ్ళీ ధైర్యాన్ని పుంజుకొని ఏమి తిన్నదో కదులుతలేదని అంటూ ఎవనిపాపం కొట్టిందో పటేలు కూడా గిట్లనే సచ్చిందనీ ఆ పెంజరని గొల్లవాడే సంపి ఉంటాడని భావిస్తుంది సిద్ధి. కానీ సిద్ధి కొడుకు సైదులే చంపాడన్న విషయం తెలియదు. ఇన్ని కష్టాలు పడుకుంటు కొడుకు కొరకు వెతుకుతుంది సిద్ధి.

సైదులు దొరికిన తరువాత బాల్‌రెడ్డి అనే లెక్కల పంతులు వలననే బడికిపోవడం లేదన్న విషయం తెలిసిన తరువాత మరునాడే సిద్ధి తన భర్తపాపయ్యను వెంటేసుకొని సైదుల్ని బడికి పంపడానికి వెళుతుంది. సైదులు బడికి పనికిరాడు అన్న బాల్‌రెడ్డితో మాట్లాడుతున్న పాపయ్యను ఆగమని సిద్ధి మాట్లాడుతుంది. ఈ మాటల్లో తన కొడుకును అందరిలాగా కాకుండా వాసన వస్తుందని పక్కకు కూర్చుండబెట్టిన విషయం చెప్పుతుంది. తన కొడుకు దగ్గర తునకల వాసన వస్తుందని సార్లు అనడాన్ని నిరసిస్తూ, రహమాన్ సారు కూడా అలాల్ చేసిన మాంసమే తింటాడని గుర్తుచేస్తుంది. మాంసం తినడం వల్ల చదువురాదని అనుకోవడం తప్పని నా కొడుకు గొంతు గంటలా మోగుతుందని వాడు తెలంగాణా పాట రామసక్కదనంగా పాడుతాడని చెబుతుంది. మిగిలిన సార్లందరిని కులము, మతము పేర్లమీద ఏ విధంగా గొప్పలు పెట్టుకున్నారో అవన్నీ వెల్లకక్కుతుంది సిద్ధి.

కూతురుగా, భార్యగా, తల్లిగానే కాక సమాజంలో ఒక చైతన్యవంతమైన స్త్రీ మనకు సిద్ధి నవలలో కనబడుతుంది. కొడుకు సైదులు పటేలు కూతురు అత్యాచారకేసులో వరంగల్ జైలుకి వెళ్ళినపుడు సైదుల్ని విడిపించడానికి చేసిన ప్రయత్నం. జైలు నుండి విడుదల అయిన తరువాత చుట్టాల ఇంటికి హైదరాబాద్‌కు పంపిన సన్నివేశం తల్లికొడుకును జాగ్రత్తగా పెంచేందుకు చేసిన ప్రయత్నాలే. చివరికి సైదులు హైదరాబాద్‌లో లీడరై ఆటోకొనుక్కొని పెళ్ళిచేసుకొని, పిల్లలైన తర్వాత మొదటిసారిగా తన ఊరికి వచ్చి జెండాపండుగకు వెళ్ళినపుడు సైదులు వెంట తల్లిదండ్రులు సిద్ధి, పాపయ్య వెళ్ళడం లాంటి సంఘటనలు తన కొడుకుకు గతంలో జరిగిన అనుభవాల్ని దృష్టిలో ఉంచుకొని జాగ్రత్తగా వ్యవహరించడమే అవుతుంది.

ఈ విధంగా సిద్ధి ఒక చైతన్యవంతమైన దళిత మహిళగా, స్త్రీల ఔన్నత్యాన్ని చాటి చెప్పుతుందని మనం సాహితీ ప్రపంచంలో చెప్పుకోవచ్చు. దళిత, బహుజన స్త్రీలు గ్రామాలలో మగవారికంటే ఉన్నతమైన ఆలోచనలతో పాటు ధైర్యాన్ని ప్రదర్శించడం మనకు కన్పిస్తుంది. నవలా రచయిత వేముల ఎల్లయ్య జెండర్‌లో మగవాడైనా స్త్రీ గొప్పతనాన్ని ఈ నవల్లో చిత్రించడంలో సఫలీకృతుడయ్యాడని భావించవచ్చు.





## సెప్టెంబర్ నెల పురస్కారాలు

| పొద్దుపోని పంచాయతీ | కాలంతో సమరం |
|---|---|
| కథకు : రూ.700/- | కవితకు : రూ.500/- |
| రచయిత : డా॥ ఎం. హరికిషన్ | రచయిత : పి. గోపినాథ్ |

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

ఎల్లి



### సెప్టెంబరు నెల వ్యాసం

ఎల్లి నవల - గిరిజన స్త్రీ జీవితం

రచయిత : డా॥ వై. సుభాషిణి

ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం' రూ. 500/- అందజేయబడుతుంది.

- ఎడిటర్

# రైతు రాజ్యం

టి. వెంకటి
9502653828

ఒక్కచిక్కిన రైతు రాజా
బరువు బ్రతుకును ఎన్నాళ్ళని మోస్తవన్నా
ఆశతో చూసి చూసి మోహం వాలిపోదన్న
అసలు వన్నెలు ఎరిగినప్పటికి
ఏరువాక సాగక పోయె
ఎట్టి బ్రతుకుల - ఆశలన్ని అడుగంటిపోయె
యింకిపోయిన - మా ఊరి చెరువల్లె

ఆరుగాలం అష్టకష్టమే
చలికివణుకుతు - చినుకుకు తడుస్తు
నవదాన్యపు రాశులకు - నిత్యకృషివలుడవే
గిట్టుభాటు ధరలులేక
గుండెబరువై - దిగులు బ్రతుకై
దారి తెలియని - బాటసారై
రహదారి తెలియని - పక్షివలే

చెమట చుక్కలకాల్వల్లో...
తడిసి ఆరిన తనవునీది
సాలు బరవాలు ట్రాక్టర్‌తో
దుక్కిదున్ని నట్టున్న శరీరం
కన్నీటి గ్రుడ్లు ఆకాశంలో వ్రేలాడుతుంటే నక్షత్రాలే
రంపపు కోతలా ముళ్ళచెట్లు రుధిర దారల ప్రవాహం
కడుపు వీపు ఒక్కటైన



ఎండిపోయిన పండిపోయిన
కందిపోయిన కరిగిపోయిన
అందరికి కడుపునిపే అమ్మకు తగ్గ అమ్మతనయుడవ్ర
ధన్యజీవి
మధ్యవర్తుల మహ్మమారులు
మరులు తెలిసిన - మాయగాళ్ళు
వలలో చిక్కిన - జింకవలే
నిత్యం భయం గుప్పిటే - నిత్య కొలిమిలా భావించే
ప్రపంచీకరణ ప్రక్రియలో
పంజరంలో చిలకవలే బందీవైతివి

బక్కి చిక్కి ఎక్కి ఎక్కి
ఏన్నాళ్ళని దౌర్భాగ్యం
ఎండిపోయిన బ్రతుకుల్లో
మండే సూర్యుడు ఉదయించాలి
ప్రగతి వెలుగుల రథ సారధి
రైతు రాజ్యపునాదిగా
గెలుపు పిలుపు వారధిగా
నడుపు నీఎదుగుర్రాల స్వారి
ఎరుపు వనం వైపు

# అక్షర కేతనం

- బి. కళాగోపాల్
9441631028



వర్ణమాల జలతారు కుచ్చుల కాగితపు పూదోటలో..
అక్షరాల చినుకులపై తేలియాడే భావాలను
దోసిళ్ళ కొద్దీ మది ఆస్వాదిస్తుంది !
అక్షర రసాస్వాదన అదొక తీరని దాహంలా !
అనంతంలా అక్షరం స్వాతిముత్యమై
మెరిసింది వాగ్దేవి గళసీమలో
కాళిదాసు నాలుకపై నాట్యమయూరాలు ఆ బీజాక్షరాలు !
వాల్మీకి క్రౌంచ విలాపంలో.. వాగ్రూపమై భాసిల్లాయి
రమణీయ రామాయణాక్షరాలు.
కాగితపు వృక్షాలపై అక్షరాల చిగుళ్ళను ఆరగించే
వసంత కోకిలలా, నాకలం అక్షర రవాలను
వీనుల విందుగా వినిపిస్తుంది.
ప్రపంచ నిఘంటువుల్లో అక్షరం ఒక దైవకణం !
అక్షరాలు మన నడతకు ఆనవాళ్ళు !
అక్షరాలు చరిత్ర పుటల్లో గీటురాళ్ళు !
అక్షరాలు క్షరమవని పంచభూతాలు !
అక్షరం నీ జీవిత సంతకం.
అక్షరం నీ అస్తిత్వ ఊపిరి.
నీవున్నా లేకున్నా ఆచంద్రార్కం వెలిగేది ఆ అక్షరమేగా !!
అక్షర కేతనం రెపరెపలాడాలీ అవని నిండా,
విశ్వకవుల భావ ఉద్దీపనలుగా,
అక్షరాలు కనిపించని అమ్మానాన్నలు !!!

---

# మమ్మల్నిలా బ్రతకన్విండి

మొదలవలస పద్మావతి
9492555008

మదమెక్కిన మృగాళ్ళు
మాటలతో మాయచేసి
ముదితను ఒంటరి చేసి
వికృత వాంఛలతో
విరుచుకుపడి
మల్లెలాంటి మగువను
రక్తపు ముద్దగ మార్చి
నడిరోడ్డున నిర్ధయగా
వివస్త్రగా విసిరేస్తే
మృత్యువుతో పోరాడి
అలసిన ఆ ఆడబిడ్డ
బ్రతకాలని ఉందమ్మా
అని అడిగి అడిగి
అసువులు బాసిన వేళ
భారతమాత గుండెపగిలి



అశృవులతో అర్థిస్తోంది
ఆడపిల్లను ఆటబొమ్మగా
అంగడి వస్తువుగా
మార్చిన విష సంస్కృతిని
విడనాడమని,
సమస్తవనితావని
అల్లాడి అడుగుతోంది
పశుపక్ష్యాదుల నుండి
క్రూరమృగాలకు సైతం
స్వేచ్ఛగా బ్రతికే
హక్కునిచ్చిన దేశంలో
మాకెందుకు స్వేచ్ఛలేదని
సమాన హక్కుల వరకెందుకు
మమ్మల్నిలా బ్రతకనివ్వమని

(సాహితీ స్రవంతి విశాఖపట్నం వారు నిర్వహించిన పోటీలో బహుమతి పొందిన కవిత)

# మరణ వాంగ్మూలం

డా॥ ఎమ్. ప్రగతి
9440798008



**నేను ఆత్మహత్య చేసుకొని ఇంకా 48 గంటలు కూడా దాటలేదు. నా మరణాన్ని ఆసుపత్రి డాక్టర్లు, మా బంధువులు కూడా నిర్ధారించినారు.**

**"ఆమెకా పురుగుల మందు ఎక్కడ దొరికింది?" నా భర్తను ప్రశ్నిస్తున్న డాక్టర్ మాటలు నా చెవుల బడుతున్నాయి. "పొలం కోసం కొనిపెట్నాం సార్! కొత్త బాటిల్ ఇంకా మూత కూడా తియ్యలేదు. రెండు మూతలు తాగినాది." నా భర్త దీనంగా సంజాయిషీ ఇచ్చుకుంటున్నాడు. "దయచేసి నన్ను బతికించండి సార్" గొంతు పెగుల్చుకొని మాట్లాడాలన్న నా ప్రయత్నం వృథా ప్రయాసే అయింది. ఎనిమిదేండ్ల అపర్ణ, ఆరేండ్ల అజయ్ కండ్ల ముందు మెదుల్తుండగా కన్నీళ్లు నిండి కళ్ళు మసకబారుతున్నాయి. నా కడుపున పుట్టిన పాపానికి వాళ్ళు తల్లి లేని పిల్లలయి పోతారా? వాళ్ళ కోసమన్నా బతికి తీరాలన్న కోరిక మృత్యువు తో పోరాడుతుండగా, మనసు గతంలోకి జారుకుంది.**

* * *

అనంతపురం జిల్లాలోని ఓ కుగ్రామంలో ఓ వ్యవసాయ కుటుంబంలో ఇద్దరు మగపిల్లలయినాక కలిగిన ఒకే ఒక్క ఆడపిల్లను నేను. ఊళ్ళో వుండే బళ్ళో అయిదు అయిపోగానే సదువాపేసి, ఇంటి పనులకు, పొలం పనులకు అలవాటు పడిన అతి మాములు ఆడపిల్లను. పదారేండ్లు దాటంగానే మరో రైతు తో నా జీవితం ముడిపడింది. మా అమ్మ, నాయనా వాళ్ళ తాహతుకు తగినట్లు ఆరు తులాల బంగారం, నలభై వేల కట్నంతో పక్క వూళ్ళో మరో రైతు కుటుంబానికి పెద్ద కోడలిగా సాగనంపారు. ఒకటి రెండు చిన్న చిన్న లోపాలున్నా నా సంసారం ఏ లోటు లేకుండానే గడిచి పోతుండాది. పెండ్లయిన రెండేండ్లకు అపర్ణ, ఆపైన రెండేండ్లకు అజయ్ పుట్టినారు. ఇల్లు సక్కబెట్టుకోవడం, పిల్లల్ని చూసుకోవడం, బరుగొడ్లకు గడ్డి పీక్కు రావడం, గాడిపాట నూకి పొయ్యడం ఇదే నా రోజువారీ జీవితం. అప్పుడప్పుడు అమ్మ, అన్నలు వచ్చి చూసి పొయ్యేవారు. "నీకిదేం కర్మే ! పొద్దుగూకులు గాడిద శాకిరీ సరిపోతాంది. ఆయప్పతో మాట్లాడి ఇడి కాపురం పెట్టి, ఏందన్నా యాపారం చేసుకుంటే సుకంగుండచ్చు గదా!" అమ్మొచ్చినప్పుడల్లా ఇదే పాట నా సెవుల్లో జోరీగ లా యినిపిస్తావుంది. పుట్టింట్లో వున్నప్పుడు కూడా నేను పొలం పోయిన దినాలు



నాకు గుర్తుండాయి. చనక్కట్టె పీకి పీకి చేతులు మండటం, గడ్డి మోపు నెత్తిన మోసుకొచ్చి పయి నవ్వులు పుట్టడం ఏదీ నేను మరచిపోలా! అదీ గాక అత్తింటి కాడ నా కొచ్చిన ఇక్కట్లంటూ పెద్దగా లేవు. అందుకే మాయమ్మ మాటలు నా మీద పనిచేయలేదు. అట్లా నాలుగేండ్లు గడిచి పోయినాయి. పిల్లలు కొద్ది కొద్దిగా పెద్దయ్యే కొద్దీ వాళ్ళ సదువుల గురించి మొదటిసారిగా నా పైన మాయమ్మ మాటలు పనిజేయడం మొదలైంది. "మన కాలమెట్లో గడిసి పోయినాది. పిల్లలన్న బాగా సదివించుకోవాల. మంచి బళ్ళో ఎయ్యాలంటే టవున్లో జేరదాం." సందు సిక్కినప్పుడల్లా మా ఆయన సెవికాడ జోరీగ నయ్యా. కానీ బూమిని నమ్ముకున్న నా భర్త అందుకు వొప్పుకోలా! నాకు పరిస్థితులతో రాజీ పడక తప్పలేదు.

* * *

"మందు కక్కిస్తున్నాం. కానీ దాని ప్రభావం ఇంకా నాలుగైదు రోజులుంటుంది. శరీరం సాధారణ స్థితికి వచ్చినట్లున్నా, వొక్కోసారి వున్నట్టుండి ఆయాసం రావడం, ఊపిరి ఆగిపోవడం జరగవచ్చు. అందుకని నాలుగు రోజులు మా అబ్జర్వేషన్లో ఉండాల్సి వస్తుంది." డాక్టర్ పరిస్థితి వివరిస్తున్నాడు. "బెంగుళూరు తీసకపోతే మేలేనా?" నా మరిది ప్రశ్న. "ఎక్కడికెళ్ళినా ఇదే ట్రీట్మెంట్ కావాలనుకుంటే మీరు తీసుకెళ్ళవచ్చు." ఏదో ఒకటి తేల్చుకోండని డాక్టర్ వెళ్ళిపోయాడు. నా భర్త, ఆయన తమ్ముడు మల్లగుల్లాలు పడుతున్నారు. వాళ్ళ మొఖాల్లో కంగారు కొట్టొచ్చినట్లు కనబడుతోంది. ఇంత వరకూ మా అమ్మా నాయన కానీ, అన్నలు కానీ రాలేదు. వాళ్ళకు విషయం తెలుసో లేదో ?

* * *

నా పెండ్లయిన ఎనిమిదేండ్లకు మా పెద్దన్నకు పెండ్లి ఖాయమైంది. ఒకటిన్నర లక్షల కట్నంతో పాటు పది తులాల బంగారంతో పెండ్లి ఖాయమైనట్లు పెండ్లికి పిలవడానికి కొచ్చిన మా నాయన మా మామతో చెబుతున్నాడు. మా మామ మొకంలో తేడా నా చూపు దాటి పోలేదు. ఆ మార్పు బయటపడనీకుండా మా మామ "ఇప్పుడు లచ్చలు లేనిదే పెండ్లి కొడుకులు యాడ దొరుకు తాండరులే. మీ బిడ్డను కావాలంటే నాల్రోజులు ముందే పిల్చుకపోండి. మేము మూర్తం రోజు వస్తాము." మా నాయన ఎల్లి పోయాడు. అప్పటి నుంచి నాకు చెడుకాలం దాపురించింది. "మీ అన్న కేమిలే, దండిగా కట్నం తీసుకుంటున్నాడు. ఇంక మనం కనబడతామా?" "మా వాడంటే సవక గా దొరికినాడు." ఇట్లా సందు దొరికినప్పుడల్లా ఎవరో వొకరి దెప్పి పొడుపులు నా సెవుల్లో ఇనపడతానే వుంటాయి. ఇని ఇననట్లే సెవిటి దానిలా పడుండాల్సిన ఆగత్యం నాది.. కొన్ని దినాలకు ఈ మాటలకు నేను అలవాటు పడిపోయాను.

కాలం గడిచే కొద్దీ మా పుట్టినింట్లో పరిస్థితులు మారు తుండాయి. యావసాయం మా నాయన కిడిసి పెట్టి మా అన్నలు చిన్నగా యాపారాలు మొదలు పెట్టినారు. బాడుగకు తిప్పడానికి సుమో జీపు కొనుక్కున్నారు. వడ్డీ కి దుడ్లు తిప్పుతూ బాగానే తయారయినారు. ఇంకో రెండేండ్లకు మా చిన్నన్న పెండ్లి వాళ్ళ స్థాయికి తగినట్లు జరిగింది. ఇంకో సారి నాకు ఇక్కట్లు మొదలయినాయి. ఒక పక్క ఇడికాపరం పెట్టమని మాయమ్మ హితబోధ. రెంటికీ నడమ నలిగి పోతుండాను నేను. అప్పటి దాకా ఎవరేమన్నా పట్టించుకోని నేను ఎదురు మాట్లాడటం మొదలుపెట్టినా. "ముష్టి నలభై వేలతో సరిపెట్నారు మీ వాళ్ళు. మీ అన్నలకు మటుకు లచ్చలు లచ్చలు గుంజు తాండరు." "నీకూ ఓ ఆడపిల్ల వుంది గదా, కాస్త దాని కేమైనా పెట్టాలన్న జ్ఞానం కూడా లేదు." నూటి పోటీ మాటలు నూదుల్లా గుచ్చుకుంటున్నాయి. "మన పెండ్లయినప్పుడు నలభై వేలు ఇప్పుడు లచ్చలతో సమానం. మన పిల్ల గురించి మనం చూసుకోవాలి గానీ, వాళ్ళెందుకు పట్టించుకుంటారు? అయినా మా అన్నల్లాగే మనమూ ఏదన్నా యాపారం లోకి దిగితే బాగుపడే వాళ్ళం కదా?" ఇలా మాటకు మాట పెరిగిపోయి, వాదులాట తీవ్ర స్థాయికి చేరింది. ఆవేశంలో పక్కనే వున్న కట్టెతో ఆయన నాతలపై గట్టిగా మోదాడు.

ఏం జరిగిందో తెలియదు. కండ్లు తెరచి చూస్తే పుట్టింట్లో వున్నాను. తలకు కట్టు వుంది. "వాడేమన్నా మనిసా? ముందే ఆటికాటికి వుండే పిల్లను అంత లావు కట్టెతో సావగొడతాడా? ఆయువు గట్టిది గాబట్టి బతికి పోయినాది గానీ." మా నాయన గట్టిగా అరుస్తా వుండాడు. మరో వైపు మాయమ్మ "వాళ్ళ అమ్మా నాయన ఎట్ల జెప్తే అట్లే ఇనుకుంటాడు. పక్కన కాపరం పెట్టించ మంటే ఇది ఇనుకుంటే గద." ముక్కు చీదుతూ ఏడుస్తా వుంది. "బండి తీయన్నా, ముందు వాడి అంతు చూసొద్దాం." మా చిన్నన్న రెచ్చి పోతున్నాడు. "ఏమనుకుంటున్నాడు మన పిల్ల గురించి? ఎవరూ లేరను కుంటున్నాడా?" మా పెద్దన్న అరుపు. "అసలు ఏం జరిగినాదో కనుక్కొని రాండి. ఆవేశంగా పోయి కొట్లాడి రావద్దు. మన పిల్ల జీవితం నాశనమై పోతాది." మా అవ్వ నచ్చ జెప్పాలని చూస్తాంది. కోపంగా అన్నలిద్దరూ మోటర్ సైకిల్ మీద



బయల్దేరి పోయినారు. దాదాపు నాలుగ్గంటల తరువాత ఆవేశంగా ఊగిపోతూ తిరిగొచ్చారు. ఏం జరిగిందో తెలీదు. "ఇక మీదట మన పిల్లను ఆ యింటికి పంపనే వద్దు. దాన్నేం బతక నిస్తాడా వాడు?" అంటూ విరుచుకు పడుతున్నారు. నా ప్రమేయం లేకుండానే అన్ని నిర్ణయాలు జరిగిపోతున్నాయి. కొన్ని దినాలు పోతే అన్నీ సర్దుకుంటాయేమోలే. ఆ వంక తో నైనా కొన్ని రోజులు పుట్టింట్లో ఉండొచ్చునని సరిపెట్టుకున్నా.

దెబ్బలు తిన్నాననే జాలితో కావచ్చు, నా మీద ప్రేమ తోనే కావచ్చు, మా అమ్మా నాయన, అన్నలు, వదినలు నాకే లోటు రాకుండా చూసుకుంటున్నారు. అడపా దడపా పిల్లలు గుర్తొచ్చి, నా ఇంటికి నేను పోదామా అనిపించేది. అంతలోనే అభిమానం గుర్తొచ్చి, ఆయనే వచ్చి పిలచక పోవాలని గమ్మునై పోయేదాన్ని. రోజులు గడిచే కొద్దీ ఇంట్లో అందరికీ నేను బరువయితాండనని వాళ్ళ మాటల్లో అర్థమయ్యేది. ఏదైనా పని కల్పించుకోబోతే "నీక్యాలమ్మా ! మేం జూసుకుంటాంలే" అంటూ వదినలు పరాయి దాన్ననే భావనను చెప్పకనే చెప్పేవాళ్ళు." ఆ యింట్లోంచి బయట పడిపక్కన కాపరం పెట్టమంటే నువ్వు యిని సస్తివా?" అంటూ అమ్మ నస. ఎప్పుడెప్పుడు ఆ ఇంట్లోంచి బయట పడదామా అనిపించేది గానీ, ఎలా బయట పడాలో అర్థంకాలా! రెన్నెల్లు తర్వాత నా బాధ తెలిసినట్లు, మా ఆయన మేనత్త, ఆమె కొడుకు, ఇంకో ఇద్దరు ఇంటికొచ్చి పంచాయతీ పెట్టారు. "మీ బిడ్డకు ఏమీ కాకుండా మేం చూసుకుంటాం. పంపించండ"ని ఆ మాటా ఈ మాటా చెప్పి నన్ను మా అత్తింటికి చేర్చినారు.

పిల్లలు కనపడంగానే నాకు ఏడుపాగలేదు. కంటినిండా చూసుకొని కరువు తీరా ఏడ్చినా. కానీ విచిత్రం! పిల్లలను దగ్గరికి తీసుకోబోతే వాళ్ళు దూరంగా జరిగారు. బిక్కు బిక్కు మంటూ భయంగా నన్ను చూస్తున్నారు. వాళ్ళ నాయన కూడా నన్ను పలకరించలేదు. ముభావం గానే వెళ్ళిపోయాడు. రాత్రికి పిల్లలకు అన్నం తినిపించాలని పోతే వాళ్ళు నా కాడికే రాలా. స్నానం కూడా వాళ్ళ అవ్వ తోనే చేయించుకున్నారు. అన్ని పనులు నా అవసరం లేకుండానే జరిగి పోతాండాయి. ఆఖరికి పొయ్యి కాడికి గూడా నన్ను రానీయ లేదు. నా పిల్లలను దగ్గరికి తీసుకోవడానికి కూడా నాకు రాసి పెట్టి లేదా? ఆయన సరే సరి, అసలు మాట్లాడడు. కొన్ని దినాలు పోతే సర్దుకుంటుందేమో నని ఓపికగా ఎదురు చూసినా. నేనెంత చొరవ జేసి దగ్గరికి పోవాలని చూసినా అంతా నన్ను అంటరాని దాన్ని చూసినట్లు చూస్తున్నారు. ఎన్ని దినాలిట్లా యడమొగం, పెడమొగంగా బతకాల, ఈ బతుకు బతికే కంటే సచ్చేది మేలేమో? ఇట్లా దినాలు బరువుగా గడుస్తుండగానే మా చిన్నాయన బిడ్డ పెండ్లికి పిలుపొచ్చింది. పిల్లలను తీసుకొని పోవాలని బయల్దేరా. "కావాలంటే నువ్వొక్క దానివి పో! పిల్లల్ని మటుకు పంపేది లేదు" నా భర్త మొదటిసారి నోరు తెరిచి కరాఖండిగా చెప్పాడు. "అదెట్లా? పిల్లల్లేకుండా నేనొక్కదాన్ని పోతే ఏమనుకుంటారు?" నేను వాదనకు దిగాను. "అట్లయితే నువ్వు కూడా పోవద్దు. అయినా రెన్నెల్లు పిల్లల్ని యిడిసిపెట్టి ఎట్లున్నావు? ఇప్పుడట్లే పో." కోపంగా బయటికి పోయినాడు. ఓ పక్క ఆవేశం, మరో పక్క బాధ. ఏం చేయాలో తోచలేదు. వాళ్ళు తెలీని కోపం లో గాడి పాటలో చేని కోసం తెచ్చి పెట్టిన పురుగుల మందు కనపడంగానే, దాని మూత తీసి గొంతులో గట గటా పోసుకున్నా. గాడి పాట్లోంచి ఇవతలికి రాగానే కళ్ళు తేలేస్తున్న నన్ను చూసి మా మరిది "ఏమయినాదొదినా?" అంటూనే పురుగుల మందు సీసా చూసి గట్టిగా అరిచినాడు. ఆ వెంటనే వాళ్ళూ వీళ్ళూ కలసి అనంతపురం లో ఆసుపత్రికి తీసుకొచ్చినారు.

* * *

బెంగుళూరు తీసుకుపోయే విషయం మీదనేమో మా ఆయనా, ఆయన తమ్ముడు తర్జన భర్జన పడుతున్నారు. మా అమ్మోళ్ళు ఇప్పటికీ రాలేదు. ఇంతలో నా కేమైందో తెలియలేదు. దొమ్మలు ఎగిరెగిరి పడుతున్నాయి. కడుపులో ఒకటే వికారం. కళ్ళు మూసుకు పోతున్నాయి. "నేను సచ్చిపోతానా?" భయం ఎక్కువైపోయింది. "వొద్దు, నేను సావకూడదు, బతకాల, బతకాల!" ఉన్నట్టుండి నా శరీరంలో కదలికలు ఆగిపోయాయి. చూపు నిలిచి పోయింది. నర్సు కేక పెట్టింది. "సార్! నాడి దొరకడం లేదు." డాక్టర్ పరుగున వచ్చి పరీక్షిస్తున్నాడు. నా భర్త కంగారుగా చూస్తున్నాడు. "అంతా అయిపోయిది. ఇంక తీసుకు వెళ్ళొచ్చు." డాక్టర్ నా భర్తతో అంటున్నాడు. "అంటే నేను చచ్చిపోయానా?" కళ్ళు తెరచుకున్నా చూడలేక పోతున్నట్లే వుంది. శరీరాన్ని కదల్చలేకపోతున్నా. మరి నా మెదడు పనిచేస్తున్నదే. అంటే నేను ఆత్మగా మారానా? కోరికలు తీరకుండా మనిషి చచ్చిపోతే ఆత్మ అక్కడక్కడే తిరుగుతూ ఉంటుందట. నిజమేనా? ఆసుపత్రి అంతా కలకలం. మా అమ్మా, నాయనా, అన్నలు వచ్చినారు. వచ్చీరావడం తోనే నా విగత శరీరాన్ని చూసి మా అన్నలు కోపంతో ఊగిపోతున్నారు. మా అమ్మ నా శరీరం మీద బడి ఏడుస్తోంది. "నువ్వేరా అన్యాయంగా



నా బిడ్డను పొట్టన పెట్టుకున్నావు. నీకంత బరువైతే మేమే సాకుతాంటిమి గదా!" మా నాయన నా భర్త చొక్కా పట్టుకొని అరుస్తున్నాడు. మా అన్నలు మా ఆయన్ని కొట్టడానికి ముందుకురికారు. ఆయన భయంతో పారిపోయాడు. మా అమ్మ అలుపు లేకుండా యేడుస్తానే వుంది. మా అన్నలు, మా నాయన మా అత్తింటి వాళ్ళందరినీ వరస పెట్టి తిట్టి తిట్టి అలుపొచ్చి ఆపినారు. ఉన్నట్టుండి మా పెద్దన్న "పా నాయనా! మనమీడేంటికి, మనూరికి పోయి ఆ నా కొడుకు మీద కేసు పెట్టి, అక్కడే వాని సంగతి తేల్చుకుందాం." అని అందరినీ బయల్దేరదీస్తున్నాడు. "మీ అమ్మను ఈడే వుండనీలేరా?" మా నాయన మాటలకు మా అన్న "నీ కేమన్నా పిచ్చా? ఈడ మనమెవురూ ఉండొద్దు. ఈ ఆసుపత్రి నుంచి బాడీని తీసక పోవాలంటే డబ్బులు కట్టాల. వాడేమో పారిపోయాడు. మనమేంటికి కడతాం? వాడే వచ్చి కట్టు కుంటాడో, ఏం చేసుకుంటాడో చేసుకోని." అంతా బయల్దేరటానికి లేచారు. "నాకు బయమయితాంది. వొక్క దాన్నీ ఇడిసి పెట్టి పోవద్దు." నేనెంత అరచినా నా అరుపు నాకే యినపడలా. ఇంక వాళ్ళకేం యినపడతాది. చూస్తుండగానే సుమో కనుమరుగయింది. జరుగుతున్న సన్నివేశాలకు నా శరీరం ప్రాణం లేని సాక్ష్యంగా వుంది. ఆత్మ మాత్రం నిస్సహాయంగా చూస్తూ వుంది.

ఆ తర్వాత పదినిముషాలకు నా భర్త, మరిది వచ్చి ఆసుపత్రిలో డబ్బులు కట్టి నా శరీరాన్ని ఎక్కడికో తీసుకెళ్తున్నారు. బహుశా పోస్టుమార్టం కోసమేమో! పెద్దాసుపత్రిలో శవాల గదిలో చేర్చారు. అప్పుడే వచ్చిన మా మామ" యీడ వుండి మనమేం జెయ్యాల్రా. మనూరికి పోయి వాళ్ళను అదిరించో, బెదిరించో కేసు పెట్టకుండా ఏదో ఒకటి చేద్దాంపాండి." అందరూ వెళ్ళిపోతున్నారు." అయ్యో! నన్నొక్కదాన్నీ వదిలేసి అందరూ పోతండరా? నేను పుట్టి బుద్ధెరిగి నప్పటి నుంచి ఏ రోజు వొక్క దాన్ని ఉండి ఎరగను. ఈ చీకటి గదిలో నాకు బయమయితాంది. పోవద్దండి.".. నా మాటలు గొంతు దాటలేక పోతాండాయి. మా వాళ్ళు కనుచూపు మేర దాటిపోయినారు.

ఈ శవాల గదిలో రాత్రంతా ఒక్కదాన్నే వుండాలంటే భయం భయంగా వుంది. ఏమో వీళ్ళు పోయినాక అమ్మోళ్ళు వస్తారేమో! ఏదో మూల చిన్నగా ఆశ. ఆ ఆశ కూడా మనషుల మాటలతో సచ్చి పోయింది.. "వాళ్ళ వాళ్ళకు ఫోన్ చేయరా, పోస్టుమార్టం చేయాలంటే ఎవరో ఒకరు వుండాలి కదా. పైగా ఆమె చెవుల్లో కమ్మలు, కాళ్ళకు మెట్టెలు, ముక్కుపుడక ఇవన్నీ వున్నాయి. ఎవరో ఒకరికి అప్పజెప్పాల కదా! ఎవరూ లేకపోతే ఎట్లా?" అని ఒకతను అంటుంటే, "ఎన్ని సార్లని చేసేది, ఎవరికి చేసినా మాకేం సంబంధం లేదంటుంటే? ఏం మనుషులో ఏమో, శవాల దగ్గర కూడా డబ్బు రాజకీయాలు." విసుక్కుంటున్నాడు రెండో వ్యక్తి. అంటే నేనెవ్వరికీ అక్కరలేదా? అత్తింటి వాళ్లకు సరే, కనీసం కన్నోళ్ళకైనా బిడ్డ మీద మమకారం లేదా? భయం స్థానంలో నెమ్మదిగా ఓ రకమైన నిర్లిప్తత, నిర్వేదం ఆవరిస్తున్నాయి. స్మశాన నిశబ్దం అంటే ఇదేనేమో! చుట్టూరానే కాదు, గుండె లోపల కూడా చప్పుడు లేదు, వెలుతురు లేదు. మొత్తం శూన్యమైపోయింది. చచ్చాక ఇలా దిక్కులేని అనాథనయితానని అనుకొనుంటే అసలు చావాలన్న ఆలోచనే వచ్చేది కాదే? నా శవానికి నేనే జాగారం చేయాలని తెలిస్తే, అసలు శవంగా మారేదాన్నే కాదే? రాత్రి గడవటం బరువయింది. చచ్చాక నిద్ర శరీరానికే గానీ, ఆత్మకు లేదేమో! జాలిగా నా విగత శరీరాన్ని చూసుకుంటూ తెల్లార్లూ గడిపాను.

బయటేదో సందడి. వాచ్ మాన్ అనుకుంటా, తలుపు తీస్తున్నాడు. మా నాయన, మా అన్నలు, మా మామ, మరిది ఇంకా ఎవరో వచ్చారు. వాళ్ళ మాటల్లో నాకర్థమైంది, పెండ్లి చేసినప్పుడు ఇచ్చిన బంగారం, కట్నం డబ్బులు వెనక్కి ఇచ్చే షరతు మీద మా వాళ్ళు అత్తింటి వారి మీద కేసు పెట్టలేదు. తగువింకా తీరలేదనుకుంటా, ఇంకా అరచుకుంటున్నారు. "శవాన్ని తీసుకుపోవాలంటే, రెండు లచ్చలు దుడ్లిచ్చి తీసక పోండి.." మా నాయన బెదిరిస్తున్నాడు. హతాశురాలినయ్యాను నేను. సచ్చిన నన్ను మళ్ళీ మళ్ళీ సంపుతున్నారు. నా చావు చుట్టూ ఇన్ని డబ్బు యవ్వారాలు జరుగుతాయంటే నన్ను నేను చంపుకొని నా పిల్లల్ని దిక్కులేనోళ్ళను చేసేదాన్నే కాదే? ఎంత ఏడ్చి ఏం ప్రయోజనం? చేసిన తప్పును దిద్దు కునే అవకాశమే లేదు. ఏం చేసి రాజీ అయ్యారో, శవాన్ని మా ఊరికి తీసకపోయి దహన సంస్కారాలకు ఏర్పాట్లు చేస్తున్నారు. బిక్కు బిక్కు మంటూ చూస్తున్న పసివాళ్ళను చూసి బోరున ఏడవాలనుకున్నా, కానీ కంటి నుంచి ఒక్క నీటి చుక్కా రాలేదు. నా చావును చూసిన ఏ ఒక్కరూ ఇలాంటి పరిస్థితి తెచ్చుకోరనుకుంటా. అవతల నా శరీరం మంటల్లో కాలిపోతా వుంది, మనుషుల మధ్య ఆప్యాయతలు అనుబంధాల లాగే.

# పదపద పదపద పోరుముందుకు



పి.ఎన్.మూర్తి
7382842823

కాలం కదలిక ఆగదు - లోకం మారకతప్పదు
మనిషే మారకపోతే - మనుగడ ముందుకు సాగదు
ఈ వైనం ఈ గమనం మార్చేటందుకు
పదపద పదపద పోరు ముందుకు
ఆకూ అలములు మేసిన మనిషి - పరుల దోపిడి ఎరుగని మనిషి
నేడిందు పసందుల వినోదమందున - మునిగి తేలుతూ కొందరుండగా
పూట గడవక ఎందరో పస్తులపడి చస్తున్నారు
ఈ వైనం ఈ గమనం మార్చేటందుకు - పదపద పదపద పోరు ముందుకు
ఆత్మీయతలతో అనురాగాలతో కల్లాకపటం కానని మనిషి
నేడింద్ర భవంతుల విలాసమందున - విర్రవీగుతూ కులుకుతుండగా
నీడేకరువై ఎందరో - జీవచ్ఛవమై వున్నారు
ఈ వైనం ఈ గమనం మార్చేటందుకు - పదపద పదపద పోరు ముందుకు
పల్లెసీమలో చేతివృత్తులతో కళకళలాడిన స్వేచ్ఛామనిషి
తరతరములకు తరగని ఆస్తులు - కూడబెట్టుకొని కొందరుండగా
ఉన్నభూమినే అమ్ముకొని - అప్పుల నిప్పులా వేగుతున్నారు
ఈ వైనం ఈ గమనం మార్చేటందుకు - పదపద పదపద పోరుముందుకు
ప్రకృతి నియమం పరిశోధించి - ప్రగతి పథమున నిలిచెను మనిషి
నేడా ప్రగతి ఫలంబులు తేరగమెక్కిన - పాలక పంచన కొందరుండగా
చేసిన కష్టం చేతికందక - అర్థాకలితో నలుగుతున్నరు
ఈవైనం ఈ గమనం మార్చేటందుకు పదపద పదపద పోరుముందుకు
అమ్మేదైవం అమ్మేగురువని - ఆరాధించిన మానవుడు
నేడాయమ్మకు రంగులుపూసి అంగడిలోన బొమ్మనుచేసి
వావి వరసలె విడిచిన నరుడు - మధమ్ హెచ్చి మృగమైనాడు
ఈవైనం ఈగమనం మార్చేటందుకు - పదపద పదపద పోరుముందుకు

# దాగిన సత్యం

- అడిగోపుల వెంకటరత్నమ్



నడుస్తూనే
పాడుతూనే
ఉద్యమిస్తూనే
ఓడిపోతూనే
గెలుస్తూనే
సందేశమౌతూనే
వాళ్ళిద్దరూ బాటసారులు
ఎన్ని వసంతాలు చిగురించినా
ఎన్ని గ్రీష్మాలు ఆకులు మాడ్చినా
గొంతులు యుగళమయ్యాయేగాని
మనసులు కలవలేదు !
కాపురం చేస్తూనే
కలలు కంటూనే
పెళ్ళిళ్ళు చేస్తూనే
ఆస్తుల్ని పోగు చేస్తూనే
ఆశ్రిత పక్షపాత మౌతూనే
వాళ్ళిద్దరూ భార్యా భర్తలు
ఎన్ని ఉదయాలు
అస్తమయాలు కరిగిపోయినా
మాటలు కలిశాయే గాని
మనసులు కలవలేదు !
అధ్యాయాల్ని చదువుతూనే
అభ్యాస మౌతూనే
కొత్త పాఠాలు నేర్చుతూనే
పరిశోధనలు చేస్తూనే
తులనాత్మక మవుతూనే
ఎన్నో పదాలకు
ఎన్నెన్నో అర్థాలు కూరుస్తూనే
వాళ్ళిద్దరూ గురుశిష్యులు
ఎన్ని విద్యా సంవత్సరాలు గడిచినా
చదువులు సాగాయే గాని
మనసులు కలవలేదు !
స్వప్నిస్తూనే
దుఃఖాలు ఈదుతూనే
పరాధీనం పాలౌతూనే
అపజయాల్ని జయిస్తూనే
అగ్ని పరీక్షలు నెగ్గుతూనే
ఆంక్షల్ని దాటుతూనే
వాళ్ళిద్దరూ ప్రేమికులు
ఎన్ని రేయింబవళ్ళు
కాలగమనంలో కలిసినా
ప్రేమాయణం సాగిందే గాని
మనసులు కలవలేదు !



# ప్రజల గొడవంతా మనగొడవే

- కాళోజీ

*ప్రజలు ఎంతో స్పందించారు. 'ప్రజాకవి' అని కూడా అన్నారు. అయితే కవినో, రచయితనో అనిపించుకోవాలనే ఉద్దేశం నాకెన్నడూ లేదని ముందే చెప్పినాను. చెప్పిన విషయంలో, నేను కోరుకున్న మార్పు మాత్రం రాలేదు. 40-50 ఏళ్ళ క్రితం రాసిన నా గొడవ, ప్రస్తుతానికి సరిపోతుందని అనుకోవాలో లేదా 50 సంవత్సరాల నా రచన సజీవంగా ఉన్నదని సంతోషించాలో, పరిస్థితులు ఇట్లాగే ఉన్నాయని ఏడ్వాలో తెలియడంలేదు. ఇదే 'నా గొడవ'.*

***కవితా రచన మీరెలా ప్రారంభించారు? మీకు ప్రేరణనిచ్చిన కావ్యాలు, కవుల వివరాలు చెప్తారా?***

నేను చదువుకున్నది పదవ తరగతి వరకే. దీని తర్వాత ఇంటర్మీడియెట్‌లో రెండో సంవత్సరం చదువుతుండగా ఆరోగ్యం బాగులేక చదువుకు స్వస్తి చెప్పడం జరిగింది. తెలుగులో నాలుగు వాచకాలు, ఉర్దూలో పది వాచకాలు, ఇంగ్లీషు పదవ తరగతి వరకున్న పుస్తకాలు, ఉర్దూలోనైనా, తెలుగులోనైనా, ఇంగ్లీషులోనైనా చదివిన చదువు ఈ మాత్రమే. దీని తర్వాత కావ్యం అనే పేరుతో ఉన్న ఏ పుస్తకం చదివి ఎరుగను. చదువుకున్న వాచకాల్లో.... ఉన్న కవితలు దాన్లో నాకు నచ్చిన పంక్తులు నన్ను ప్రభావితం చేసినాయి. ఇంట్లో అమ్మద్వారా, అన్న ద్వారా సావర్కార్ జీవిత కథతో లోకమాన్య తిలక్ గాథలతో ఆర్యసమాజం విషయంలో పరిచయం కల్గింది. నాయనగారు ఎప్పుడూ చదువే. తెలుగు భాగవతంలోని ప్రహ్లాద చరిత్ర, ప్రహ్లాదుని కథ నన్ను ఎంతో ప్రభావితం చేసింది. ఇంగ్లీషు వాచకాల్లో, ఇంగ్లీషు కవిత, స్కాట్ కావచ్చు. సరిగ్గా జ్ఞాపకం లేదు. Breaths there a man with sole so dead unto himself has not said this is my own matinee land. ఆ కవిత ఆధారంగా, రాసిన నా గొడవ "మాతృదేశం మాట ముచ్చట ముదము గూర్పదు మదికి అని యెడి. పరమ నీచుడు పృథ్వి అంతట కాలియ వెదికిన కానదగనా?

***నీరులేని ఎడారి ఐనను, వాన వరదల వసతి ఐనను అగ్గి కొండల అవలి ఐనని మాతృదేశము మాతృదేశమే?***

ఉద్యమాలలో ప్రచారం కోసం తిరుగుతున్నప్పుడు ఇచ్చిన ఉపన్యాసాలు ప్రభావం కంటే కథలు ఎక్కువ ప్రభావం చూపిస్తాయనే నమ్మకం. ఆ తర్వాత ఈ కథల కన్న నా 'గొడవ' రూపం క్లుప్తం, ఎక్కువ ప్రభావం చూపుతోందని నిర్ణయానికి వచ్చి ఆ ప్రక్రియ చేపట్టాను. అదే సాగింది. నేను ఉద్యమాలలో పాల్గొనడానికోసం ప్రేరణ చిన్నప్పుడు అమ్మ చెప్పిన సావర్కార్ విషయం ఆయన వీరోచిత కార్యక్రమాలు, సముద్రం ఈదడం, అండమాన్ జైల్లో జీవితం దానికి సంబంధించిన వివరాలు, సావర్కార్ రాసిన స్వీయ చరిత్ర మరాఠీ, అమ్మ చదివినపుడు అన్న వినడం, అన్న చదివినపుడు అమ్మ వినడం జరిగేది. అది విన్నాను. మా నాయన ఉర్దూ సాహిత్యం ప్రత్యేకించి కవిత, మరికొంతలో ఉచిత విద్య ప్రచారం చేసేవారు. ఉర్దూ పుస్తకంలో కొన్ని కవితలు ప్రత్యేకించి నన్ను ప్రభావితం చేసిన కవిత రాంప్రసాద్ బిస్మిల్‌ను వురికెక్కించినపుడు చదివిన గజల్ అది. నాయన, అన్న చదవగా విన్నాను. ఆ కవిత నాటికీ, నేటికీ నన్ను ప్రేరేపిస్తున్నది. నన్ను ప్రేరేపించిన వాటిలో మేనమామ నలదేవ్ శాస్త్రి, తలిదండ్రి వున్నారు. తెలుగులోనైనా నేను నేర్చుకున్నది మాటలతోనే. ఇంట్లో నాయనగారితో ఉర్దూ నేను తెలుగు నేర్చుకున్నది. ఉన్న కుగ్రామంలోని ఇరుగు, పొరుగు పిల్లలతో మాట్లాడ్డం జరిగేది. సాహిత్యపరంగా (ఆ దృష్టితో) నేర్చుకున్నది ఏమీలేదు. తెలుగులో పద్యం చదవడం (సంధులు, సమాసాలు మొదలైనవి విడదీసి) ఇప్పటికీ రాదు. ఏది ఏమైనా ఎక్కువగా సొంతంగానే నా 'గొడవ' ప్రారంభించాను.

***నా 'గొడవ' అనే పేరెందుకు ఎంచుకున్నారు? నిజానికి మీరు రాసిందంతా ప్రజల గొడవేకదా?***

ప్రజల గొడవంతా మన గొడవే. ఆ ప్రజలలో నేనొకొకడిని, నా రచనల్లో వ్యక్తిగతమైనవి ఏమీలేవు. చెప్పిందంతా సమాజపరంగా చెప్పిందే. అందుకోనమే నా 'గొడవ' అనే పేరు దానికి.

సాహిత్యపరంగా, రచయితగా, కవిగా పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవాలని నాకెన్నడూ లేదు. నా రచన కవిత్వంగా భావింపబడాలని నేనెన్నడూ భావించలేదు. అందుకే నా గొడవలో నా గొడవనునది 'ఎదచించుక వచ్చునది, ఎడతెగక పారునది నాకు అనుపించునది, ఎడతెగని 'వా' గుడిది అన్నాను.

***అనేక సంపుటాలుగా నా 'గొడవ'కు పాఠకుల ప్రతిస్పందనకు సంబంధించిన మంచి అనుభవాలు వున్నాయా?***

సాహిత్యపరంగా ఏమోకాని, ఉద్యమపరంగా ఆయా ఉద్యమాలకు సంబంధించి నేను ప్రభావితుడునై రాసిన నా 'గొడవ'కు ప్రజలైతే బాగానే స్పందించారు. ఆయా ఉద్యమాల రోజుల్లో నా 'గొడవ'ను సభలలో వినిపించాను.

ప్రజలు ఎంతో స్పందించారు. 'ప్రజాకవి' అని కూడా అన్నారు. అయితే కవినో, రచయితనో అనిపించుకోవాలనే ఉద్దేశం నాకెన్నడూ లేదని ముందే చెప్పినాను. చెప్పిన విషయంలో, నేను కోరుకున్న మార్పు మాత్రం రాలేదు. 40-50 ఏళ్ళ క్రితం రాసిన నా గొడవ, ప్రస్తుతానికి సరిపోతుందని అనుకోవాలో లేదా 50 సంవత్సరాల నా రచన సజీవంగా ఉన్నదని సంతోషించాలో, పరిస్థితులు ఇట్లాగే ఉన్నాయని ఏడ్వాలో తెలియడంలేదు. ఇదే 'నా గొడవ'.



***కాలంబురాగానే కాటేసి తీరాలె అంటూ ఆవేశంతో రాయడానికి కదిలించిన అంశాలేమిటి?***

అప్పటి నల్లగొండ జిల్లా జనగామ తాలూకా భైరాన్‌పల్లి మొదలైన గ్రామాల్లో రజాకార్లు, ఆనాటి నిజాం పోలీసులు వందలాది మందిని అతిక్రూరంగా హత్య చేసిన వార్త మేము గుల్బర్గా జైలులో ఉండగా మాకు చేరింది. ఆ వార్త విన్నాక బ్యారక్సులో సభ జరిపి ఆ సభలో వినిపించిన గేయం ఇది.

అంతకుముందే జైలు బయట ఉన్నపుడు 1946లో అదే జనగామ తాలూకా మాచిరెడ్డిపల్లి, ఆకునూరులో రజాకార్లు, పోలీసులు కలిసి చేసిన అత్యాచారాలు, స్త్రీల మానభంగాలు, గృహ దహనాలకు సంబంధించి "మాచిరెడ్డిలో, ఆకునూరులో దోచిన మానము చాలింక, పాలనా పేరిట, పల్లెపల్లెలో జరిగే పాపం చాలింక, బీదల సర్వస్వంతో ధనికులు చేసిన బేరం చాలింక, కాలము వ్యర్థము చేయగకళయని, రాసిన కవితలు చాలింక, కలము చేత కదలింపకున్న కాళోజీ కాయమే చాలింక అని రాసినాను. అంతకుముందే 'దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకొని దొరలై వెలిగే దెన్నాళ్ళు, పోలీసండను దౌర్జన్యాలు పోషణ పొందే దెన్నాళ్ళు నల్లగొండలో నాజీ వృత్తుల నగ్ననృత్యమింకెన్నాళ్లు" అని ఎన్నాళ్ళు అనే గేయంలో ప్రశ్నించాను.

"కాలంబు రాగానే కాటేసి తీరాలి" 'ఎన్నాళ్లు' అనే గేయాలు ఈనాటికీ వర్తిస్తున్నాయి. అంటే నా 'గొడవ' ప్రభావం లేనట్లే కదా. అందుకే అనవలసి వచ్చింది. 'గంటము చెన్నము అరిగిను కంటకములే మాత్రము తరిగెను. ఎలుగెత్తి పాడిన నంతాలు, ఏ మాత్రం తీర్చెను లోకం తంటాలు. ఊరడి పోసిన పంది పిల్ల అరుపు పూజారికి చేయగలదా చెరువు. బలంతోడుగా లేని న్యాయం కవి కనిపెట్టిన గొప్ప ఉపాయం, 'కవుల కలసలు లేదు బుద్ధి, అన్నవాడు మహసుబుద్ధి' ఇదంత చెప్పడం కవిగా పేరొస్తే లాభంలేదు. దాని ప్రభావంతో ఏదైనా మార్పు వచ్చిందా లేదా అన్నది పరీక్ష. అందుకే రాయవలసి వచ్చింది (ఒక ఉగాది సందర్భంలో) ఏటేటా ఎందుకనే పాట ఏడు మారినా ఈడు ముదరినా ఏమి మారినది ఈ లోకంలో 'ఆ మార్పు లేదనే నా 'గొడవ' మార్పు కావాలనే నా గొడవ.

***ప్రజాతంత్ర ఉద్యమంతో భావపరమైన అనుబంధం వున్నా ప్రత్యేకించి ఎలాంటి సంస్థలు, సంఘాలతో మీరు సంబంధం పెట్టుకోకపోవడానికి కారణం?***

సమాజపరమైనా ఏ విషయమైనా మేధావిని స్పందింపచేసినపుడు వారి అభిప్రాయం వెల్లడి చేసే స్వాతంత్ర్యం ఉండాలె! ఆ వెల్లడికి మతపరమైన, పార్టీపరమైన అంతర్గత శాఖలపరమైన అడ్డంకులు రాకూడదని నా అభిప్రాయం. 'ఎవని మాట ఐతేమి ఏ మాటకు ఆ మాటే' అందుకే పార్టీ దృష్ట్యా పలకడం, పార్టీ అదుపులో పలకడం అది వెనకటి పాతివ్రత్యం వలె 'పార్టీవ్రత్యం' "పార్టీ తప్పంటే తప్పు పార్టీ ఒప్పంటే ఒప్పు" అనే ధోరణి మహా ప్రమాదకరమైంది. రచయిత నిజాయితీకి ఈ నిర్బంధం అసలే పనికిరాదు. అందుకే ఆయా ఉద్యమాలు నడిపించే పార్టీలతో సహకరించినా సహకరించే రచనలు చేసినా ఆయా పార్టీల నిర్బంధం మాత్రం ఒప్పుకోలేదు. అందుకే ఏ పార్టీలో కట్టుబడలేదు.

***సమాజ విముక్తి విషయంలో మీ అభిప్రాయాలేమిటి? మార్క్సిజాన్ని మీరు విశ్వసిస్తారా?***

మానవ సమాజంలో ఏదీ తుది మాట కాదు. ప్రయోగార్థమే బ్రతుకు. బ్రతుకు ప్రయాణం నిండా, అడుగడుగునా ప్రయోగాలు జరుగుతూనే ఉంటాయి. దాన్లోనిలోపాలు కనిపెడ్తూ

నవరించు కుంటూ మళ్ళీ మళ్ళీ కొత్త ప్రయోగాలు చేస్తూ పోవలసిందే. ఏ ప్రయోగం ఐనా తాత్కాలికంగా వచ్చిన మార్పైనా శాశ్వతమైంది కాదు. మురికి చేరుకుంటుంది. శుభ్రం చేసుకుంటూ పోవాలి. ఏ చీపురు కట్టతోనైనా శుభ్రం చేసుకున్నాం ఇక, శుభ్రం చేసుకునే పనిలేదు. అనడం సబబు కాదు. మళ్ళీ మళ్ళీ మురికి చేరుతుంటుంది. మళ్ళీ శుభ్రం చేసుకోవడం తప్పదు. ఉదయం లేవగానే నోట్లో నున్న పాచిన, పండ్లను శుభ్రం చేసుకుంటాం. ఎంత శుభ్రం చేసుకున్నా మళ్ళీ రోజూ పండ్లు తోముకోవలసిందే. అంతేగాని, ఒకసారి తోముకున్నాం గనక, ఇక తోముకునే అవసరమే పడదు అనలేదు. సమాజపరంగా జరిగే, రాజకీయంగా జరిగే మార్పుల విషయంలో కూడా అంతే 'దోపిడీ' దౌర్జన్యాలు అసలే జరగకుండా చూద్దామనే ఏర్పాట్లు కట్టుదిట్టాలు శాశ్వతం కావు. ఈ విషయమై ఎప్పుడూ అలజడి, ఆందోళన జరగవలసిందే. ప్రజాస్వామ్యానికి పునాది. అనవసర జాగరూకత తప్పదు. మానవుని మానవుడు మానవుని మాదిరిగా మన్నించలేనంత మలిన మైనది మానవుని హృదయం. తనూ మానవుడినని, ఎదుటి వాడు మానవుడని గుర్తించడం జరగాలి. దానికై ప్రయత్నం సాగుతుండాలి. 'నేనింకా నా నుండి వరకే రాలేదు. మన అన్నప్పుడు గదా ముందడుగు, మనం అనే అభిప్రాయం రావడానికి ఎడతెగని ప్రయత్నం ఎల్లవేళలా సాగుతుండాలి.



***పౌరహక్కుల ఉద్యమంలో చురుకైన పాత్ర వహించే మీకు, కొన్ని తీవ్రవాద గ్రూపుల వ్యక్తిగత హత్యాకాండ వల్ల ఎలాంటి అభిప్రాయాలున్నాయి?***

ఎవరి మాటైతేమి.... ఏ మాటకు ఆ మాటే ఏ తీవ్రవాదం ప్రకారం ఎవరు ఏమి చేసినా అది ఆలోచన లేకుండా నాయకుని మాటనో, గ్రూపు నాయకుని మాటనో పాటించడం అసలు 'ఇజం' అని ఇంకో అభిప్రాయంగల గ్రూపుది తప్పని ఒకరితో ఒకరు పరస్పరం పోరాడుకోవడం అసలు 'ఇజం' తలపెట్టిన ప్రజాక్షేమానికి ప్రమాదం, విరోధం గ్రూపుల శక్తి సామర్థ్యాలు పరస్పర వైరుధ్యాలతో వ్యర్థమైపోతాయి. దాని కారణంగానే వ్యక్తిగత వైషమ్యాలు పగలూ, అంతశాఖలు, పరస్పర సంఘర్షణలు, మతం మతం మధ్య ఉండే సంఘర్షణల కంటే ఎక్కువ ప్రమాదకరమైనవి అని చరిత్ర చెపుతున్నది. మతం వద్దని ఇజాల పేరిట మళ్ళీ వెనుకటి ధోరణినే ముఠాలుతయారై, ఏదైతేం, ఏమైతేం, ఎచటైతేం, హింస తప్పు, రాజ్యహింస మరీ తప్పు. కానీ ప్రతి హింస తప్పుకాదు. అని నా అభిప్రాయం. పౌరహక్కుల సంఘాలు నాకు తెలిసినంతమటుకు ఎప్పుడూ నేరము జరగాలని, న్యాయస్థానం నిర్ణయించిన ప్రకారం నేరస్తుడు శిక్షించబడాలనే అంతేగానీ పాలనాధికారం తన పోలీసుల ద్వారా ఏ విచారణ లేకుండా ఎవర్నయినా శిక్షించడం (నేరస్తున్ని కూడా) తగదని పౌరహక్కుల కోసం పోరాటం చేసే వానిగానూ అభిప్రాయం. వ్యక్తిగతమైన హత్యకైనా, పార్టీలు చేసే హత్యకైనా చట్టబద్ధంగా చర్య తీసుకోవల్సిందే.

***మీ అసంపూర్ణ జీవిత చరిత్ర పూర్తి చేస్తున్నారా?***

జీవిత చరిత్ర మొదటి భాగం రికార్డు చేసిన 30-40 క్యాసెట్లు విని, రాసి ప్రచురించబడ్డది. విశాఖ మిత్రులు దీన్ని ముద్రించారు. వారే రెండో భాగం కూడా రావాల్నని ఓ ఇరవై, ముప్పై క్యాసెట్లు స్థానిక మిత్రుల సాయంతో రికార్డు చేసుకున్నారు. ఇంకా అది అసంపూర్ణమే. అయిన క్యాసెట్లు తిరిగి రాసుకొని ఇదే నా 'గొడవ' రెండవ భాగంగా ఎప్పుడొస్తుందో ఆ విషయంలో ప్రయత్నం చేసి మిత్రుల కెరుక.

***కవిత్వంలో నిబద్ధతను మీరు హర్షిస్తారా?***

జిహ్వకోరుచి, పుర్రెకో బుద్ధి అని సామెత. లార్డ్ బైరన్ అన్నట్లు 'ఒకే ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక, అట్లా రచయిత రచన ఉండాలి. ఏ మనిషికి కూడా ఆలోచనకు, ఆలోచన ప్రకటనకు నిర్బంధం ఉండకూడదనే మనం రచయితకు నిబద్ధత ఉండాలనడం విచిత్రం. నిబద్ధత తగదని స్వీయ ఆలోచనాపరంగా తన అభిప్రాయాన్ని వెల్లడించే స్వేచ్ఛా స్వాతంత్ర్యం కలవాడు ఒక రచయితే! ఏమతమైనా, ఏ ఇజమైనా వాని స్వాతంత్ర్యానికి అడ్డుపడకూడదని నా అభిప్రాయం.

***శక్తివంతమైన కవులు కాగోరే వారికి మీరిచ్చే సూచనలు?***

శక్తివంతము కానిది కవిత్వమే ఆకదు. ఒకే ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక అన్నాడు బైరన్. మరినేను ఒలక పోసింది సీసాల కొద్దీ, సిరా, ఏదీ ఒక్క మెదడైనా కదలదేం. అసలు నా మెదడు కదిల్తే కదా? రచయిత కదిలి కదలించాలి. బైరన్ కావచ్చు అన్నాడు "Ceaze thou heart ceaze to move as thou hast ceazed to move others కదలలేని కదపలేని ఎదబరువును మోయలేను" అన్నది నా గొడవ, నేనింకా నా నుండి మా వరకే రాలేదు. మన అన్నప్పుడు కదా ముందడుగు. ఆయన అన్న అభిప్రాయంతో రాయాలి.

*(దర్పణం సాహిత్య ప్రత్యేక సంచిక 2000, ఏప్రిల్ నుండి)*

# నిర్భయ మరణఘోష

- నాయని కళ్యాణి శ్రీదీప్తి
8125566318

ఖండాంతరాన, అంతఃరిక్షాన, భారత అతివలు అవలీలగ విహరిస్తుంటే,
ఈ అఖండ భారతం - అకృత్యాల నలిగే నెలతల నెత్తుటి కన్నీటి సెగతో
మరుగుతోంది !
భరతఖండ ఆవిర్భావం - ఓ కన్య శకుంతల శాప నివారణం,
దుర్నీతి దుష్యంతుల, దుర్మార్గ, దుశ్శాసన దుర్భర దురాగతాల దిక్కుగ
మారెనా మన భారతం !
నాడు హస్తిన నిండుసభలో పాంచాలి వస్త్రాపహరణం, కురుక్షేత్రశంఖారావం,
నేడు రాజధాని నడిరోడ్డున "నిర్భయ" మానభంగం, మానవత్వపతనానికి
పరాకాష్ట !
"వందేమాతరం" నినాదాలు నినదించిన నాటి అస్వతంత్ర్య భారతం,
మగువ మానభంగాలు, అత్యాచారపు ఆక్రందనల దద్దరిల్లుతోంది ఈనాడు
స్వతంత్ర్యంగా !
చట్టాలకు సవాలుగా; అత్యాచారపు ఆనవాలుగా, మిగిలిందా "అమానత్"
ఆడబ్రతుకు;?
మూడు మౌన ప్రదర్శనలు, ఆరు ఉద్యమాలు, పది ర్యాలీలు, కాలక్రమేణా
మరుగున దాగే నిజాలు !!
మహిళా మరణ వాంగ్మూలాలు, కావాలి మరి మృగాళ్ళ మెడల ఉరిత్రాళ్ళు !!
అధికార దుర్వినియోగం, చట్టం చేతులను, న్యాయం నోరును హరిస్తుందీ !?
డబ్బు - దుర్మార్గం - దర్జాగా !!
పాలు గారు పసిపాపను నెత్తుటి ముద్దగ మార్చే పాపిష్టి పాపానికేదీ శిక్ష ?!
రాక్షస పైశాచిక పద ఘట్టనలో నలుగుతున్న మగువ మానానికేదీ రక్ష?!
పతుల హింసించే అనుమాన యమ పతుల నీచానికేదీ నిష్కృతి?!
వరకట్న వేధింపుల, వనితల తెగటార్చే అత్తల అకృత్యాల కేదీ ముగింపు !!
అభినవ కీచక, అరాచక, పైశాచిక వాంఛల పాల బిడ్డ పడతుల కేదీ
ఓదార్పు ?!
మూడేళ్ళ పసిప్రాయం, ముసలి ముదిమి కాదా, కామాంధుల కామానికనర్హం!?
ప్రకటనల పతాక ప్రతీక "స్త్రీ" అంగాంగ ప్రదర్శన లేదా వీటికి నిరసన ?!
మగువ మర్మాంగం కాదది; మానవ జన్మ కుహరమని తెలుపలేరా !!?
మధోన్మాధ మత్తున మగ్గిన మృగ మగాళ్ళ కుసురు పోసిందీ ఆడతనం
కాదా !!
అకృత్యాల కోరల్లో అమానుష చేష్టల్లో, పులినోట చిక్కిన లేడి కూన తీరు
"నేటి ఆడకూతురు" !!
రాక్షస రాజకీయ, నపుంసక రక్షణ దళం, చట్టం చాటున కులికే
కులీనత్వం !
మరపురాని మణిపూర్ మనోరమ "మానభంగం" మానవతకి మాయని
మచ్చ !
అస్సాం కోక్రాబొర్ ఘటన, సాయుధ సిబ్బంది దుశ్చర్య, భారత సైన్య
సిగ్గులేని తనమా !?
రద్దు కాని "అప్పా చట్టం' బాలికా భవితల్ని కాలరాస్తూన్న సైనికదళం
లేదా వీరికి నిషిద్ధం !!?
ఆమ్ల దాడుల ప్రాణాలవిసిన కాలేజీ కన్నెలెందురో !
ఏదీ ఆ ముష్కరులకు మరణ శిక్ష !?



(సాహితీ స్రవంతి విశాఖపట్నం వారు నిర్వహించిన పోటీలో బహుమతి పొందిన కవిత)

# అనిశెట్టి నాటకాలు - ప్రయోగాత్మక ధోరణులు

- డా॥ పి.వి. సుబ్బారావు
9849177594



**అంగ్ల సాహిత్యాన్ని మథించిన అనిశెట్టి తన గాలిమేడలు నాటకంలో తొలిసారిగా ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని ప్రయోగించాడు. అదే నాటకంలో తొలిసారిగా ప్రేక్షకుల నుండి పాత్రలను ప్రవేశపెట్టాడు. మావూరు నాటకంలో విశిష్టమైన అనన్యమైన టెక్నిక్‌ని ప్రవేశపెట్టాడు. ప్రపంచ నాటక సాహిత్యంలో హామ్లెట్‌లో మాత్రమే అటువంటి టెక్నిక్ చూడగలమని విమర్శకులు ప్రశంసించారు.**

అనిశెట్టి సుబ్బారావు బహుముఖ ప్రజ్ఞతో సాహితీ ప్రక్రియలన్నింటిని స్పృశించాడు. కవిత్వం, నాటకాలు, నాటికలు, రేడియో నాటికలు, కథానికలు, వ్యాసాలు, అనువాదాలు, సినిమా సాహిత్యం మొదలైన ప్రక్రియలన్నింటిని చేపట్టి సుసంపన్నం చేశాడు. అభ్యుదయ కవిగా 'అగ్నివీణ', బిచ్చగాళ్ళ పదాలు కవితా సంపుటాలు వెలువరించాడు. నాటకకర్తగా సామాజిక సమస్యలను చిత్రించే రెండు ప్రసిద్ధమైన నాటకాలు రాశాడు. 1. మధ్యతరగతి మందహాసాన్ని చిత్రించిన గాలిమేడలు. 2. గ్రామీణ కుటిల రాజకీయ సంక్షోభానికి అద్దం పట్టిన 'మావూరు' నాటికలు ఎనిమిది రాశాడు. వాటిని 1. సమస్యాత్మక నాటికలు, 2. మధుర జీవన స్వాప్నికతలు, 3. మూకాభినయాలుగా వర్గీకరించి పరిశీలించవచ్చు. సమస్యాత్మక నాటికలు : 1. శాంతిలేదు 2. చెప్పుక్రింద పూలు 3. బ్రతుకు భయం. మధుర జీవన స్వాప్నికతలు : 1. జీవన సంగీతం 2. చరమాంకం.

మూకాభినయాలు : 1. శాంతి 2. ఓటెవరికి 3. రిక్షావాలా.

రేడియో నాటికలు : ఆయన వ్రాసిన రేడియో నాటికలలో 12 లభ్యమౌతున్నాయి. 1. ప్రతిష్ట 2. యుగధర్మం, 3. జగత్ సంసారం 4. విశ్వాసం, 5. ఏక కుటుంబం, 6. జట్కావాలా, 7. జీవితం - పోరాటం, 8. ధర్మం, 9. బ్రతుకు భారం, 10. జీవనోత్సవం, 11. శాంతి సంగీతం, 12. అవినీతి నీవెక్కడ ?

అనిశెట్టి 1922 అక్టోబరు 23వ తేదీన గుంటూరు జిల్లా నరసరావుపేటలో జన్మించాడు. ఆయన ప్రముఖ భావకవి నాయని సుబ్బారావు శిష్యుడు. పాఠశాలలో అనిశెట్టికి కుందుర్తి ఆంజనేయులు, రెంటాల గోపాలకృష్ణ, బెల్లంకొండ రామదాసు, మాచిరాజు దేవీప్రసాదులు సహాధ్యాయులు. ఏల్చూరి సుబ్రహ్మణ్యం, స్వామీకేశవతీర్థులు ఆయన సీనియర్లు.

**ప్రయోగాత్మక నాటక రచయిత అనిశెట్టి :** కవికన్నా నాటకర్తగా ప్రసిద్ధి పొందాడు. ఆంగ్ల సాహిత్యాన్ని మథించిన అనిశెట్టి తన గాలిమేడలు నాటకంలో తొలిసారిగా ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని ప్రయోగించాడు. అదే నాటకంలో తొలిసారిగా ప్రేక్షకుల నుండి పాత్రలను ప్రవేశపెట్టాడు. మావూరు నాటకంలో విశిష్టమైన అనన్యమైన టెక్నిక్‌ని ప్రవేశపెట్టాడు. ప్రపంచ నాటక సాహిత్యంలో హామ్లెట్‌లో మాత్రమే అటువంటి టెక్నిక్ చూడగలమని విమర్శకులు ప్రశంసించారు. చెప్పుక్రింద పూలు నాటికలో 'అబ్సర్డ్' పద్ధతిని ప్రవేశపెట్టాడు. పాశ్చాత్యనాటక ప్రక్రియారూపాలైన మూకాభినయం (Pantomime) నృత్యమూకాభినయం (Dance Ballet) వంటి ప్రక్రియలను తెలుగులో తొలిసారిగా ప్రయోగించాడు.

అనిశెట్టి నాటకాల్లో, నాటికల్లో ప్రయోగాత్మక ధోరణులను పరిశీలించడమే ప్రస్తుత వ్యాస ప్రధానోద్దేశ్యం.

**ఫ్రాయిడ్ మనోవిశ్లేషణకు ప్రతిరూపం అనిశెట్టి గాలి మేడలు :** ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం ఆధారంగా అనిశెట్టి మధ్యతరగతి

మందహాసాన్ని గాలిమేడలు నాటకంగా 1950లో రచించాడు.

ప్రజాదరణ పొందిన ఈ నాటకంలో మధ్యతరగతి మానవుడు దైనందిన సమస్యలను అధిగమించేందుకు మార్గం లేక అవకాశం దొరికినప్పుడల్లా స్వప్నసన్నివేశాల్లో సమస్యలను విస్మరించి మధురమైన జీవనాన్ని అనుభవించేటట్లు మనోహరంగా చిత్రించాడు.

పాశ్చాత్య విమర్శకులు, సాంఘిక నాటక స్వరూపాన్ని వివరిస్తూ "Drama, a presentation of interpretations of everyday social behaviour and consequential action which are offered a good currency. More over because as the audience, people can be shown more of course causes and consequences of action than they can ever know in the socially real world, the theatre provides useable paradigms for conduct" దైనందిన సామాజిక ప్రవర్తనలను, సమస్యలను నిజజీవితం కంటే భిన్నంగా ప్రజాదరణ పొందే విధంగా చిత్రించడమే నాటక ధ్యేయం. మానవ ప్రవర్తనకు సంబంధించి ఆదర్శమైన విధానాన్ని అనుసరించిదగిన ధోరణి నాటక రంగస్థలం ప్రేక్షకులకు అందిస్తుందని టాంబర్న్ అభిప్రాయం. దీనికి అనుగుణంగా అనిశెట్టి గాలిమేడలు నాటకాన్ని రూపొందించాడు.

అనిశెట్టి గాలిమేడలు నాటకంలో ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని తొలిసారిగా తెలుగులో ప్రవేశపెట్టాడు. ఈ విషయాన్ని నిర్ధారిస్తూ వేమూరి ఆంజనేయశర్మ గాలిమేడలు నాటక సమీక్షలో 'స్వాప్నిక జగత్తులో కలిగే అనుభవాలు, ఆరాటాలు, వాస్తవిక జగత్తుకు సంబంధించినవే కాని, వేరేవీ కావు అనే ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని అనిశెట్టి అనుసరించారన్నాడు"

అత్తిలి కృష్ణారావు భారతి పత్రిక సమీక్షలో "అనిశెట్టి గాలిమేడల్లో ఫ్రాయిడ్ సిద్ధాంతం కన్నా మధ్యతరగతి జీవితచిత్రణమే ముఖ్యమనడం బాగుంటుందన్నాడు."

ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని పరిశీలించి ఈ నాటకంలో అనిశెట్టి ఏ మేరకు అనుసరించాడో నిర్ధారించడం అవసరం.

**ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం :** 'వాస్తవిక జీవితంలో మానవులకు అనేక రకాలైన కోరికలు కలుగుతుంటాయి. కానీ వాటిలో చాలా భాగం కోరికలు తీరే అవకాశం ఉండదు. ఆ తీరని కోరికలే స్వాప్నిక జగత్తులో కొత్తరూపం ధరిస్తాయి. అవే స్వప్నాలని సిగ్మండ్ ఫ్రాయిడ్ సిద్ధాంతం చేశారు"

వాస్తవిక జీవితంలో ఏ వ్యక్తులను చూస్తే ద్వేషభయాదులో వారే గాలిమేడలు రెండో అంకంలో నర్సయ్య - సీతారామయ్య - కాబూలీవాలా వేషాల్లో ప్రతిబింబించారు. వారే మూడో అంకంలో వెంకట్రావు - నారాయణరావు - హోటల్ యజమానిలా కనిపించారు. పై విషయాన్ని అనుసరించి అనిశెట్టి గాలి మేడలు నాటకంలో ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని అనుసరించాడన్న వేమూరి ఆంజనేయశర్మ గారి అభిప్రాయం సమజసంగా ఉంది.

భారతి సమీక్షకులు (1953 - మే) అత్తిలి కృష్ణారావు చెప్పినట్లు మధ్యతరగతి జీవన చిత్రణ ఉందన్న అభిప్రాయం ఆమోదయోగ్యమే. కానీ ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం లేదనడం, ఆ సిద్ధాంతాన్ని పరిశీలించకుండా చెప్పిన తొందరపాటు అభిప్రాయమే అనిపిస్తుంది.

అనిశెట్టి గాలిమేడలు నాటకంలో ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని అనుసరించి వాత్సవ తీరని కోరికలు' నాటకంలో ప్రవేశపెట్టాడు. అనిశెట్టి తన జీవన సంగీతం నాటికలో కూడా ఈ పద్ధతిని ప్రవేశపెట్టాడు.

**ప్రేక్షకుల నుండి పాత్రలను ప్రవేశపెట్టిన తొలి తెలుగు నాటక రచయిత అనిశెట్టి :** పాశ్చాత్య నాటక ధోరణి అనుసరించి, అనిశెట్టి గాలిమేడలు నాటకంలో ప్రేక్షకులు రంగస్థలం మీద పాత్రలు పరస్పరం మాట్లాడుకోవడం అనే ప్రయోగాన్ని కొత్తగా ప్రవేశపెట్టాడు. ఈ ప్రయోగాన్ని అనిశెట్టి తొలిసారిగా ప్రవేశపెట్టాడన్న విషయాన్ని వేమూరి ఆంజనేయశర్మ నిర్ధారిస్తూ, 'పాశ్చాత్య దేశాల్లో ఇలాంటి ప్రయత్నాలు జరుగుతూ ఉన్నాయి. మనదేశంలో కూడా అనిశెట్టి ఈ నాటకం ద్వారా ఆ ప్రయత్నం చేశాడు. ఎవరి ప్రభావం ఏఏ ఘట్టాల్లో హృదయం మీద హత్తుకుంటుందో ఆ వ్యక్తులూ, ఆ ఘట్టాలు వేరువేరు రూపాలలో ప్రత్యక్షం కావడం సంభవిస్తుందని ఆయన నిర్ణయించారు"

నాటకంలో ప్రధాన పాత్రధారి మాణిక్యాలరావు ప్రేక్షకులతో భయాన్ని కప్పిపుచ్చుకుంటూ "మీ జీవితంలో రుచి లేదండీ ! అభిమానం ఎక్కువ. అవమానాలు ఎక్కువే. అందుచేత నా తీరని కోరికలన్నీ స్వప్నాల్లోనే తీర్చుకుంటా! నా స్వప్నాలు నవ్విస్తాయి. కవ్విస్తాయి. ఏడిపిస్తాయి. ఒక్కక్షణం తీరిక ఉంటే స్వప్నజగత్తులో ప్రవేశించి సర్వసౌఖ్యాలు అనుభవిస్తా" అంటాడు.

మాణిక్యాలరావుకు నిజజీవితంలో హెడ్‌గుమాస్తా ఆంజనేయులు - బ్యాంకు మేనేజింగ్ డైరెక్టర్ ప్రభుత్వం (పోలీస్ సూపరింటెండెంట్) అంటే భయం. వారే స్వాప్నిక జగత్తు మొదటి ఘట్టంలో సాక్షాత్కరిస్తారు. రెండవ ఘట్టంలో ప్రకృతి, స్వభావం అవే అయినా ఆ వ్యక్తులే సత్రపు కాపలా జవాను నర్సయ్యగా, సీతారామయ్యలుగా సాక్షాత్కరించారన్నారు. భారతి సమీక్షకులు అత్తిలి కృష్ణారావు "ఇలాంటి పద్ధతి ఒకటి రెండు పాశ్చాత్య రూపాకాల్లో ఇంతకు పూర్వమే ప్రవేశపెట్టారు. ఇది ఈ రూపకంతో తెలుగులో ప్రవేశించిందని చెప్పవచ్చు"

పై విమర్శకుల అభిప్రాయాలను అనుసరించి ప్రేక్షకులను పాత్రలుగా మార్చే పద్ధతి పాశ్చాత్య ప్రభావంతో తెలుగులో ప్రవేశపెట్టిన ఘనత అనిశెట్టిదేనని అవగతమౌతుంది.

గాలిమేడలు మొదటి భాగంలో మాణిక్యాలరావుతో ప్రేక్షకులు పాత్రలుగా మారి 'ఇంతకు మీ పేరేమిటి?" అని ప్రశ్నిస్తారు. "నా పేరు మాణిక్యాలరావు అంటారులెండి." అని

చెబుతాడు. గాలిమేడలు చివరి భాగంలో మాణిక్యాలరావు తన భార్య అన్నపూర్ణతో తన స్వాప్నిక స్మృతుల ఘనతను వివరిస్తూ ఆ సందర్భంలో ప్రేక్షకులతో "నాకొక స్వప్నం వచ్చింది మీరు చూడలేదుగా? అంటాడు. ప్రేక్షకుల నుండి ఒకరు లేచి "చూశాం! చూశాం!" అంటారు. "మాణిక్యాలరావు వారితో మా కుటుంబం చాలా పెద్దది. ఇప్పుడు చితికిపోయిందిలెండి!" అంటాడు. ప్రేక్షకులలో నుండి మరొక మీ స్వప్నం సహజమేనంటారు. ఈ ప్రయోగం ప్రేక్షకులకూ ఆసక్తికరంగా ఉంటుంది.

డాక్టర్ పైడిపాల "సాంఘిక నాటకాల్లో ప్రేక్షకుల నుండి నటులు రంగస్థలం మీదికి వచ్చే ప్రయోగం ఆత్రేయ 'ఎవరు దొంగ?' నాటకంతో ఆరంభమైందన్నాడు"

రచనా కాలాన్ని అనుసరించి పరిశీలించినా, విమర్శకుల అభిప్రాయాలను గమనించినా ఆత్రేయ 'ఎవరు దొంగ? (1951) నాటకం కంటే అనిశెట్టి గాలిమేడలు (1950) నాటకంలో ఈ పద్ధతి ముందుగా ప్రవేశపెట్టబడింది. కనుక పైడిపాల అభిప్రాయం సరైంది కాదు.

అనిశెట్టిని అనుసరించి ఈ ప్రయోగాత్మక పద్ధతిని ఆత్రేయ ఎవరు దొంగ? విశ్వశాంతి నాటకాల్లో ప్రవేశపెట్టాడు. ఇంకా ఆర్.వి. చలం 'ఇది నాటకం కాదు - యండమూరి 'ఆర్తి', 'కుక్క', శశిమోహన్ 'కోహినూర్' పోస్టుమార్టం'. సంజీవి 'ఈ చరిత్ర ఏ సిరాతో ?' 'నీరుపోయి' యం. దివాకరబాబు 'కేక', శిష్టా చంద్రశేఖర్ 'భువనఘోష' వంటి నాటకాల్లో ఉపయోగించుకున్నారు.

**గ్రామీణ కుటిల రాజకీయ సంక్షోభం అనిశెట్టి మావూరు :** అనిశెట్టి మావూరు నాటకాన్ని గ్రామీణ కుటిల రాజకీయ సంక్షోభానికి దర్పణంగా, విషాద సాంఘిక నాటకంగా 1953 - జూన్‌లో వ్రాశాడు.

పాశ్చాత్య విమర్శకుడు ఫ్రెంజ్‌హిల్. సంఘర్షణను చిత్రించుట సాంఘిక నాటక ఆవశ్యకమని చెబుతూ "Since Drama Deals with social relations we may also say that dramatic conflict is of a social nature. The essential character of drama is conflict"

ఫ్రెంజ్‌హిల్ అభిప్రాయనుగుణంగా అనిశెట్టి గ్రామీణ కుటిల రాజకీయ సంఘర్షణను మావూరు నాటకంలో చిత్రించాడు. అందులో నాటకశిల్పాన్ని గుర్చి బెల్లంకొండ రామదాసు "మాఊరు నాటకంలో విశిష్టమైన, అనన్యమైన టెక్నిక్ ఉంది. ఈ టెక్నిక్ ప్రపంచ నాటకాల్లో హామ్లెట్‌లో మాత్రమే చూడగలుగుతాం. 'కింగ్‌లియర్'లోను, ఒథెల్లోలోను మనం చూడగలుగుతాం. హామ్లెట్‌ను శివశంకరాన్ని తులనాత్మకంగా పరిశీలించి, వారి మానసిక సంఘర్షణల్లోని సాదృశ్యాన్ని గమనించవచ్చు" అన్నాడు.

అనిశెట్టి 'చెప్పుక్రింద పూలు' నాటకంలో సమకాలీన ఇతివృత్తాన్ని స్వీకరించినట్లు మొదటి దృశ్యంలో "ఈ కాలంలో జరుగుతున్న సంఘర్షణ ఇది. ఏదో ఒక రూపంలో ప్రతి ఇంట్లో అనునిత్యం జరుగుతున్న సంఘటనలివి" అని చెప్పాడు.

ఈ నాటికలో ఇలా జరిగితే బావుంటుందన్న విషయాన్ని మాత్రం రచయిత చెప్పలేదు. స్వార్థపూరిత వ్యాపార మనస్తత్వానికి ప్రతీకలైన పాత్రలు, సమాజంలోని నిరుద్యోగ సమస్య ఈనాటికలో చిత్రించబడినందున ఇది అబ్సర్డ్ పద్ధతికి చెందిన నాటకంగా చెప్పవచ్చును. పాశ్చాత్య ప్రభావంతోనే ఈ నాటికను మూడు దృశ్యాలుగా విభజించాడు.

**తెలుగులో ప్రతిష్ఠాత్మక మూకాభినయం (Pantomime) అనిశెట్టి శాంతి :-** ఫాంటోమైమ్ ప్రక్రియను గుర్చి పాశ్చాత్య విమర్శకులు, తెలుగునాటక రచయితలు, దర్శకులు, పరిశోధకులు తెలిపిన అభిప్రాయాలను పరిశీలిద్దాం.

Websters లో Dictionary "A drama played without words, using only action and gestures. Action or gestures without words" సంభాషణా రహితంగా కేవలం అభినయ ప్రాధాన్యంతో అంగవిక్షేపాలతో ప్రదర్శించేది ఫాంటోమైమ్ అని చెప్పబడింది.

లారెల్లే అనే విమర్శకుడు "ఫాంటోమైమ్ అనే వాస్తవమును భ్రమను సృజింపజేస్తూ ఊహాత్మక సన్నివేశాలను సంఘటనలను తలపింపజేస్తూ నిలిచి ఉండే కళగా పేర్కొన్నాడు. దీనిలో గొప్పతనం కళాకారుని సమర్థతపై ఆధారపడి ఉంటుందని కూడా పేర్కొన్నాడు. జీన్‌డార్స్ అనే విమర్శకుడు "ఫాంటోమైమ్ అనేది పూర్వం అనుకరణ పూర్వకమైన నాటకం. నిశ్శబ్ద నటనకు తోడు ఫాంటోమైమ్ సంఘటనలను వివరించే సంగీతభరిత వస్తువులను కలిగి ఉండే" దన్నాడు. చార్లెస్‌ఆబర్ట్ "ఫాంటోమైమ్ అనేది నటనకు భాష్యంగా లేక మూగ ప్రదర్శనగా అభివర్ణించవచ్చునన్నాడు."

పాల్‌కర్టిన్ ఊహా వస్తువులను సన్నివేశాలను వాస్తవమనే భ్రమను కలిగించే కళగా పేర్కొన్నాడు.

సెవరిన్ అనే కళాకారుడు "ఫాంటోమైమ్‌ని అనుకరణ నాటకంగా" పేర్కొన్నాడు.

తెలుగు నాటక రచయితల, దర్శకుల, నటుల అభిప్రాయాలను పరిశీలిద్దాం.

ఆచార్య చాట్ల శ్రీరాములు (థియేటర్ ఆఫ్ ఆర్ట్స్) "ఫాంటోమైమ్ ఒక కథలాంటిది. దానిలో ఇతివృత్తం, సన్నివేశాలుండాలి. కానీ రంగస్థలంపై నటించే నటులు మూకాభినయం చేయాలి తప్పవారు మాట్లాడకూడదు. ఇదే ఫాంటోమైమ్ లక్షణం. దీనికి పరిణామంగా డాన్స్‌బ్యాలే ప్రక్రియ వచ్చింది."

సినీ నృత్యదర్శకులు డి. వేణుగోపాలస్వామి ఫాంటోమైమ్‌ను సినీడబ్బింగ్‌తో పోల్చారు. "సినిమా డబ్బింగ్‌లో తెరపై బొమ్మ కనిపిస్తుంటే అక్కడే పెదవుల కదలికలకు అనుగుణంగా డైలాగ్ చెప్పాలి. ఫాంటోమైమ్‌లో రంగస్థలంపై నటుడు నిశ్శబ్దంగా నటిస్తుంటే దానికి అనుగుణంగా వ్యాఖ్యత సంభాషణలు, వ్యాఖ్యానం చెప్పాలి" అన్నారు.

డా॥ పి.యస్.ఆర్. అప్పారావు "వాచకాభినయరహితమైన కేవలం అంగ విక్షేపములతో దృష్టి, ముఖ రాగాదులతో స్వగత, పరగత భావములను ప్రదర్శించెడి ఆంగికాభినయం మూకాభినయం అనబడును" అని పేర్కొన్నారు.

పై అభిప్రాయలన్నీ పరిశీలిస్తే సంభాషణా రహిత నేపథ్య వాఖ్యాన సహిత అంగికాభినయ ప్రాధాన్యం గల ప్రక్రియ మూకాభినయం అని తెలుస్తుంది.

డా॥ వనం మధుసూధన్ "ఫాంటోమైమ్‌ను రెండు విధాలుగా వర్గీకరించాడు. మొదటి రకంలో పాత్రల అభినయం మాత్రమే ఉంటుంది. సంభాషణలు ఉండవు. వీటిని అభినయ ప్రాధాన్యం గల ఏకాంకిలుగా (ఫాంటోమైమ్స్) పేర్కొనవచ్చు. రెండవ రకం మూక ఏకాంకికల్లో పాత్రల అభినయానికి తగిన విధంగా నేపథ్యంలోంచి సంభాషణలు కానీ, పాటలు కానీ వినిపిస్తాయి అన్నారు"

సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే నృత్య సంగీత ప్రాధన్యం కల డాన్స్‌బ్యాలేని మూడవ రకం మూకాభినయంగా పేర్కొవడం సమంజనమని నా అభిప్రాయం. వీటి లక్షణాలు నృత్య మూకాభినయంలో చర్చించబడ్డాయి.

**శాంతికి సంకేతం – అనిశెట్టి శాంతి మూకాభినయం :** శాంతి కాముకత, యుద్ధ విముఖత అనిశెట్టి సాహితీ ప్రక్రియలన్నింట మూలసూత్రం. అందుకే శాంతి మహోద్యమానికి నీరాజనంగా అనిశెట్టి శాంతి మూకాభినయం రూపొందించాడు. ముద్రాపకుల మాటల్లో "ఇది మన సీమలో వెలసిన తొలి మూగ నాటిక" అన్న విషయం తెలుగులో తొలి మూకాభినయం శాంతి అనే విషయాన్ని నిర్ధారిస్తుంది.

**"శాంతి" – ఇతివృత్తం :** శాంతి అంటే నిర్యుద్ధ పరిస్థితి మాత్రమే కాదు. రెండు ప్రపంచ యుద్ధాల బీభత్సకాండల మధ్య అసందిగ్ధ పరిస్థితి కాదు. ఈ విషయం అనిశెట్టికి సువిదితం. మానవజాతిని పురోగమింపజేసేది అచ్చమైన శాంతి. అనిశెట్టి ఆకాంక్షించే శాంతి ఇదే. ఈ శాంతిని ప్రతిష్ఠింపజేసే లక్ష్యంతోనే ఆయన శాంతి ఇతివృత్తాన్ని రూపొందించాడు. నిరుద్యోగ యువకులను సైనికులుగా చేరమని ప్రలోభపెట్టే యుద్ధశక్తులను నిరసించాడు. అణుబాంబుల మారణకాండల బీభత్సాలను గర్హించాడు.

"సంగ్రామం మన శత్రువు / లోకశాంతి మన గమ్యం

జగదేక మహోద్యమం జయిస్తుంది నిశ్చయం / సుఖం శోభ సౌందర్యం / లోకశాంతి మన గమ్యం" అన్న సందేశంతో శాంతి నాటిక ముగిసింది.

**అనిశెట్టికి అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిపెట్టిన శాంతి మూకాభినయం :** శాంతి తొలిసారిగా 1951 ఏప్రియల్ 16వ తేదీన మద్రాసు మ్యూజియం థియేటర్‌లో అభ్యుదయ కళాసమితి వారిచేత ప్రదర్శింపబడింది. వారి ఆధ్వర్యంలో కొన్ని వందల ప్రదర్శనలు విజయవంతంగా ప్రదర్శించబడి ప్రేక్షకులకు అభిమానపాత్రమైంది. 1952 సెప్టెంబరులో ఏలూరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర సాంస్కృతిక మహాసభలలో ప్రదర్శింపబడింది. వీటితోపాటు పెక్కు శాంతి సందేశాత్మక నాటికలు, నాటకాలు కూడా ప్రదర్శింపబడ్డాయి. ఆ సభలలో ఆత్రేయ. విశ్వశాంతి నాటిక. కూడా తొలిసారిగా ప్రదర్శింపబడింది. ఆ ప్రదర్శనల్లో అనిశెట్టి శాంతికి ప్రథమ బహుమతిగా బంగారు పతకం లభించింది. ఈ పురస్కారం శాంతి శిల్పవంతమైన ఔన్నత్యానికి తార్కాణం. ఈ విజయపరంపరల ప్రోత్సాహంతో ఆలిండియా పీస్ కౌన్సిల్ మహాసభలలో ప్రదర్శింపబడి అఖిల భారత స్థాయిలో ఎన్నో ప్రదర్శనలు జరుపుకుంది. డాక్టర్ పైడిపాల ఏలూరు సాంస్కృతిక మహాసభలలో ఆత్రేయ విశ్వశాంతికి బంగారు పతకం లభించిందని ఆత్రేయ నాటకాలు – పూర్వాపరాలు అనే సిద్ధాంత గ్రంథంలో పేర్కొన్నాడు ఇది కేవలం నిశిత పరిశీలన చేయకుండా చెప్పిన పొరపాటు అభిప్రాయమే.

మద్రాసు 1953 ఫిబ్రవరి 8 నుండి 19 వరకు జరిగిన అంతర్జాతీయ ఫిలిం ప్రదర్శనల్లో శాంతి సోవియట్ ప్రతినిధి వర్గం ఎదుట ప్రదర్శింపబడి, వారి హర్షామోదాలు పొందింది. వారి సిఫారసు మేరకు సోవియట్ ఫిలిం సంస్థ 1200 అడుగుల నిడివి గల చిత్రంగా రూపొందించి రష్యాలో వేలాది ప్రదర్శనల్లో దాదాపు 30 లక్షల మంది ప్రేక్షకులు తిలకించి పులకించే అవకాశం కలిగించింది.

శాంతి తమిళం, మళయాళం, కన్నడం మొదలైన ప్రాంతీయ భాషల్లోకి అనువదించబడి ఎన్నో ప్రదర్శనలకు నోచుకొంది. ఇంగ్లీషు, చైనా వంటి అంతర్జాతీయ భాషల్లోకి అనువదించబడి ప్రదర్శింపబడింది. శాంతి మూకాభినయం వల్ల అనిశెట్టి జాతీయ కవిగా అంతర్జాతీయ కవిగా పేరుప్రతిష్టలు పొందాడు. అందుకే శాంతి ప్రతిష్ఠాత్మక మూకాభినయం.

**అనిశెట్టి మరో మూకాభినయం ఓటెవరికి? :** 1955 జనరల్ ఎన్నికల సందర్భంగా కమ్యూనిస్టు పార్టీ ప్రచార నిమిత్తం అనిశెట్టి 'ఓటెవరికి'? మూకాభినయం రూపొందించాడు. మద్రాసు ప్రజానాట్యమండలి కళాకారులు 1955 జనవరి 20నుండి 30వ తేదీ వరకు ఆంధ్రదేశంలో అన్ని ప్రధాన కేంద్రాలలో ప్రదర్శించి దాదాపు 5 లక్షల మంది ప్రజలను ఊర్రూతలూగించాడు. అందులో కోగంటి గోపాలకృష్ణయ్య 'వీధి భాగవతం', అనిశెట్టి 'రిక్షావాలా', ఆత్రేయ 'అంత్యార్పణ' రామకోటి 'పిట్టల దొర' ప్రజలను విశేషంగా ఆకర్షించాయి.

'ఓటెవరికి' ప్రదర్శనను గూర్చి తుమ్మల వెంకట్రామయ్య సమీక్షిస్తూ "ఇందులోని నటులకు, వ్యాఖ్యాతలకు నేపథ్య గాయకులకు చక్కని సమన్వయం ఉన్నందున ఈ ప్రదర్శన రసవత్తరమై జయప్రదమైంది. రచనకు పుష్టినిచ్చే నటన, వ్యాఖ్యానం, వన్నెతెచ్చే సంగీత దర్శకత్వం ఈ ప్రదర్శనను జయప్రదం చేశాయి. ఈ ప్రదర్శనలో చివరి ఘట్టాలు ప్రజలను మరీ ఉత్తేజపరిచాయి. ఇతర రైతుకూలీలతో పాటు జమీందారు కొడుకు తన ముసలి తండ్రిని కమ్యూనిస్టు పార్టీకే ఓటేయమని ప్రబోధించేదృశ్యం అతనికే పరిమితం కాదు. ప్రేక్షకులలో సందిగ్ధావస్థలో వున్న వారిని సైతం కదిలిస్తుంది. కమ్యూనిస్టు పార్టీ వైపుకే మొగ్గేటట్లు చేస్తుంది. ప్రేక్షకులు తాదాత్మ్యంచెందే రసవత్తర ఘట్టాల్లో ఇది ముఖ్యమైనది" అన్నారు.

1955 జనరల్ ఎన్నికల సందర్భంగా కమ్యూనిస్టు పార్టీ విజయానికి ఈ మూకాభినయం ఎంతో దోహదం చేసిందనడం నిస్సంశయం.

అనిశెట్టి ప్రమేయంతో గిడుతూరు సూర్యం "మానవుడు – చిరంజీవి" మూకాభినయాన్ని రూపొందించి మద్రాసులో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో ప్రదర్శించి మెప్పుపొందాడు. దీనికి ఇతివృత్తాన్ని గిడుతూరి సూర్యం అశువుగా చెప్పాడు. అనిశెట్టి రచనా విధానాన్ని సమకూర్చాడు. డి. వేణుగోపాలస్వామి ప్రదర్శనకు సంబంధించిన సవరణలు చేశాడు. ఈ ముగ్గురి సంయుక్త కృషితో రూపొందించిన మానవుడు – చిరంజీవిలో స్వార్థపరమైన సమాజంలో పెట్టుబడిదారుల దురహంకారపు చేష్టలవల్ల ఎన్నో ప్రాణాలు అహుతైపోతున్నాయని నిరసించారు. "మనసున్న మానవుడెప్పటికీ చిరంజీవే" అన్న సందేశంతో ముగిసిన ఈ మూకాభినయం

ప్రజాభిమానంతో ఎన్నో ప్రదర్శనలు పొందింది.

**తెలుగులో తొలి నృత్యమూకాభినయం** (Dance Ballet) **అనిశెట్టి రిక్షావాలా :** పాశ్చాత్య ప్రభావంతో తెలుగులో ప్రవేశించిన ప్రక్రియల్లో నృత్యమూకాభినయ రూపకం లేదా నృత్యరూపకమొకటి. ఆంగ్లంలో దీనిని 'బ్యాలే' అంటారు Oxford Companion to the theatre అనే గ్రంథంలో బ్యాలేని గూర్చి "A Theatrical Spectacle in which the action is presented in a highly specialised form of dancing and mime accomplishment of music. Though dancing has its horizon in remote antiquity and is one of the fundamental components of the theater, ballet is of much later horizon and emerges only at the renaissance"

రంగస్థలంపై ప్రదర్శించే సంగీతయుక్తమైన నృత్యకాభినయాన్ని బ్యాలేగా పేర్కొనవచ్చు. అతి పురాతన కాలంలో రంగస్థలంపై కేవలం నృత్య ప్రాధాన్యంతో విలసిల్లే ఈ ప్రక్రియ సాంస్కృతిక పునరుజ్జీవనానంతరం బ్యాలేగా పరిణితి చెందిందన్న వివరణ సమంజసంగా ఉంది.

Webster's డిక్షనరీలో బ్యాలేని గూర్చి "Artistic Dancing in which conventionalized posses and steps are combined with light and flowing figures and movements. Theatrical Art form by which ballet dancing together with music, scenery, costume and some times pantomime or speech conveys story, theme or atmosphere of the audience"

సంప్రదాయసిద్ధమైన కళాత్మక నృత్యం వివిధ భంగిమలతో, విభిన్న అభినయాత్మక కదలికతో కూడుకొని ఉంటుంది. నృత్యంతో పాటు సంగీతం, ప్రకృతి దృశ్య చిత్రీకరణ, వేషధారణతో కూడుకొని వాచికరహితంగా లేదా సంభాషణాత్మకంగా గానీ ఇతివృత్తాన్ని, వాతావరణ చిత్రీకరణను ప్రేక్షకులకు ప్రదర్శించే ప్రక్రియను బ్యాలేగా పేర్కొనవచ్చునని వ్యక్తమవుతుంది. పై అభిప్రాయాలను అనుసరించి నృత్యమూకాభినయం లక్షణాలను ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు. 1. నృత్య ప్రధానంగా, సంగీతయుక్తంగా ఉంటుంది. 2. వాచికరహితంగా, మూకాభినయంగా ఉంటుంది. 3. నేపథ్యంలో మాత్రం సంభాషణాత్మక వ్యాఖ్యానం ఉంటుంది. 4. ప్రకృతి దృశ్య చిత్రీకరణ, వేషధారణ ఆవశ్యకం.

**నృత్యమూకాభినయ పరిణామం :-** క్రీ.శ. 14. శతాబ్దిలో ఫ్రాన్స్ చక్రవర్తి లూయీ దీనికి బ్యాలే మర్యాదను సమకూర్చాడు. మోలియర్ దీనిని అభివృద్ధి పరిచాడు. 'జీన్‌జీర్నెన్‌నొవారే' భావ ప్రకటనకు ప్రాధాన్యమిచ్చాడు. ఈ ప్రక్రియ రష్యాలో అభివృద్ధి చెందినందున రష్యన్ బ్యాలేగా ప్రసిద్ధి చెందింది. క్రీ.శ. 15వ శతాబ్దిలో ఈ ప్రక్రియ ఇటలీలో రాజాంతఃపుర కుటుంబాలకు మాత్రమే పరిమితమైనదిగా ప్రచారం పొందింది. ఈ నృత్య రూపకంలో వాచికం లేకుండా కేవలం అంగవిన్యాసంతో నాట్యగత భావాలను ప్రదర్శించే మూకాభినయ రూపక లక్షణం కూడా మిళితమై ఉన్నందున దీనికి నృత్యమూకాభినయంగా పేర్కొనడం సమంజసంగా ఉంటుంది. తెలుగులో ఈ ప్రక్రియను ప్రవేశపెట్టిన ఘనత అనిశెట్టి సుబ్బారావుదే.

**అనిశెట్టి రిక్షావాలా :-** పాశ్చాత్యనృత్య రూపకాల ప్రభావంతో నృత్యదర్శకుడు డి. వేణుగోపాలస్వామి ప్రేరణతో అనిశెట్టి 1955లో రూపొందించిన తొలి నృత్యమూకాభినయం రిక్షావాలా. బెంగాలీ రచయిత సుఖాంతభట్టాచార్య వ్రాసిన 'మెయిల్‌రన్నర్' ఆధారంగా దీనిని రూపొందించాడు. దీనిపై మహీధర రామోహనరావు వ్రాసిన రిక్షావాలా కథానిక ప్రభావం కూడా ఉంది.

అనిశెట్టి సామ్యవాద మానవతావాద దృక్పథంతో (Socialistic Humanism) రిక్షావాలా వ్రాశాడు. సామ్యవాద మానవతావాదాన్ని గూర్చి Readers Companion to the world literature "In literature Marxist writer turned to an interestor the lower classes and propaganda eliminate their measure and improve along marxist lines"

కమ్యూనిజం పునాదిపై ఏర్పడ్డ సామ్యవాద మానవతావాదంలో ఈ క్రింది లక్షణాలను గమనించవచ్చు. 1. పీడిత మానవ సానుభూతి 2. శ్రామిక జనసంక్షేమం 3. సామ్యవాద మానవాభ్యుదయం ఈ లక్షణాలన్నీ అభ్యుదయ కవుల్లో ఉన్నాయి. ప్రత్యేకించి అనిశెట్టిలో ప్రస్ఫుటంగా ఉన్నాయి.

రిక్షావాలా నృత్యమూకాభినయంలో నగర జీవిత నిరసన వ్యక్తమౌతుంది. రిక్షా కార్మికుడు సమాజంలో పీడితుడు. అతడు ఒకప్పుడు బాగా బ్రతికినవాడు. పరిస్థితులు ప్రభావం వల్ల, పారిశ్రామికీకరణ వల్ల బ్రతుకుదెరువుకు గత్యంతరం లేక బస్తీకి వలస వచ్చాడు.
"గడపలో గౌరవం / కడుపులో కరువు / గతిలేక వెతికావు / బస్తీకి తెరువు"

ఒకప్పుడు సంపన్న కుటుంబీకుడైన రిక్షావాలా తరతరాలుగా పెద్దరికం చలాయించినవాడే. ఇంగువ కట్టిన గుడ్డ వాసనలా అతని గడపలో గౌరవం ఉంది. అయినా ఆకలి కరువుపెట్టే బాధ భరించలేక విధిలేక బస్తీకి వలస వచ్చాడు.

**పీడితపక్ష సానుభూతి –** అనిశెట్టి సమాజంలో పీడితుడైన రిక్షావాలా మీద సానుభూతిని చూపిస్తూ "ఇంటి బాధ పీడగా / నీవెంటనంటి వచ్చిన / గుండెలోన శూలాలై / కోరికలే గుచ్చిన / పిలిచే ఈ నరులందరి / బాడుగలే మోస్తావా! / బలిసిన ఈ నగరానికి ఊడిగమే చేస్తావా /[2] ఆర్థిక దుస్థితి వల్ల అహంకార విలసితమైన నగరానికి ఊడిగంచేస్తూ నరులందరి బాడుగలు మోస్తున్న స్థితికి రచయిత నిండుగుండెతో సానుభూతిని చూపించాడు. ప్రకృతి వైపరీత్యాలు సంభవించిన అతడికి చాకిరీచేయక తప్పడంలేదు. భవిష్యత్తు మీద ఆశతో అతడు శ్రమిస్తూ జీవిస్తున్నాడు.

శ్రామిక జనసంక్షేమం – అనిశెట్టి శ్రామిక జనసంక్షేమ లక్ష్యంతో రిక్షావాలా శ్రేయస్సుకోరి "తడిసి తడిసి ముద్దగా / చల్లబడి తనువంతా / పిల్లలగతి ఏమౌనని / తల్లడిల్లగ మనసంతా / ఆయాసం నీరసం / లాగుతూ, తూలుతూ వాలుతూ కూలిపోతివేలా ! / అయో! అన్నా"[3] అంటాడు. అనారోగ్యస్థితిలో, దీనావస్థలో కూడా రిక్షావాలా బండి లాగుతూ, తూలుతూ కుప్పకూలిన స్థితిని ఆర్ద్రహృదయంతో అనిశెట్టి బొమ్మగీసి చూపినట్లు వర్ణించాడు. ఆ దుస్థితిలో కూడా అతడు భార్యా పిల్లలను పోషించేందుకు రిక్షాలాగుతున్నాడు. అతడి పట్ల ప్రగాఢ సానుభూతితో, సమసమాజం సిద్ధిస్తుందన్న ఆకాంక్షతో రిక్షావాలాకి

# చుక్కల్లో రక్తధార

- యమ్. పవన్‌కుమార్
7306248364



జారేకురులు, ఎరుపెక్కిన చెక్కిళ్లతో
ఈ ప్రపంచమే హరివిల్లు అని,
అలుపెరగక తిరిగా, తెలిసిన చోటల్లా
ఈ భువి మాయని, మరో మయసభ అని తెలియదుగా!

మగ ముసుగు వేసుకొన్న మద మృగం
మరిపించెను ఆ దుశ్శాసన కార్యం
పాంచాలిని కాపాడిన కృష్ణుడు లేడు
కీచకుని వధించిన భీముడూ లేడు

శీలమే ప్రాణముగా, శీలమే పోగా ప్రాణమే విడిచెనుగా
తామసులు వెలసిన క్షణమది
సాయం కోరిన కనులు, చితిలో సమాధి అవగా
ఈ ఆత్మఘోష ఎవరికి పట్టింది?

మౌనం మంచిదే
మంచిని మింగిన ఈ తరుణాన
కరుణలేని ఈ క్షణమున
మౌనం ఇక కరగాలి
మౌనం మంచిదే

సమాజపు చివరి వలువలు విడువకముందే
పరాయి రాజ్యం వెకిలిగా నవ్వకముందే
మౌనం ఇక కరగాలి
మౌనం మంచిదే
మన ఆడపిల్లలు వెలిగే చుక్కలు
చుక్కల్లో రక్తధారలు చూడగా
మౌనమిక కరగాలి
మార్పే రాదా ! దానికి నాంది నువ్వే కారాదా
ఇక విషమే సుధగా మారదా, జగాన ప్రేమ విరియదా

**(సాహితీ స్రవంతి విశాఖపట్నం వారు నిర్వహించిన పోటీలో బహుమతి పొందిన కవిత)**

---

మానవాభ్యుదయాన్ని ప్రబోధిస్తూ "ఈ ముష్టి లోకమే / ఈ దుష్ట లోకమే మారులే / ఈనాటి కష్టమే / నీ మహారిష్టమే తీరులే" అంటాడు. సమసమాజం సిద్ధిస్తే ఈ ముష్టి దుష్టలోకపు తీరు మారుతుందని రిక్షావాలా కష్టాలు తీరుతాయని ఓదార్చాడు.

కవి ఊహల్లో సమసమాజం ఆవిర్భవించినప్పుడు సామ్యవాద మానవాభ్యుదయం సిద్ధించినపుడు దాని స్వరూపాన్ని వర్ణిస్తూ "నిఖిలావనిలోన నిండు / నిత్యకళ్యాణమే / భోగాలు భాగ్యాలు / విలసిల్లునులే అన్నా ! చల్లగ ఈ జగమంతా / వర్ధిల్లునులే అన్నా"[5] అంటాడు. సమసమాజం వచ్చినపుడు పీడితులు, కార్మికులు, శ్రామికులు కష్టాలు గట్టెక్కుతాయని అనిశెట్టి ఆకాంక్ష.

నగర జీవితాన్ని నిరసిస్తూ "ఇది నగరం కాదోయ్ / ఇది ఘోరకఠోర నగరమిది / భయంకరాటవి"గా వర్ణించాడు. అనిశెట్టి రిక్షావాలా సామ్యవాద మానవతావాద సిద్ధాంత లక్ష్యంగా పీడిత మానవ సానుభూతి, శ్రామిక జన సంక్షేమం, సామ్యవాద మానవాభ్యుదయం, నగర జీవిత నిరసనలు చిత్రించాడు.

అనిశెట్టి రిక్షావాలా సుప్రసిద్ధ నృత్య దర్శకులు డి. వేణు గోపాలస్వామి దర్శకత్వంలో ఇండియన్ 'బ్యాలే సెంటర్' ఆధ్వర్యంలో 200 ప్రదర్శనలతో అశేష ప్రజానీకపు మన్ననలు పొందింది. 1957లో మద్రాసులో విద్యార్థి యువజన సమావేశాల్లో ప్రదర్శింపబడి మెప్పు పొందింది. ది. 16-1-1959 మద్రాసు ఆంధ్రమహిళా సభ ఆధ్వర్యంలో డా॥ సి.డి. దేశ్‌ముఖ్ అధ్యక్షతన అనిశెట్టి 'రిక్షావాలా', శ్రీశ్రీ 'ఆనందం అర్ణవమైతే' నృత్యమూకాభినయాలు ప్రదర్శింపబడి ప్రశంసలు పొందాయి. సరోజ్ అశ్వత్ అనే రచయిత రిక్షావాలాని కన్నడంలోకి అనువదించాడు. కన్నడంలో దాదాపు 20 ప్రదర్శనలతో ప్రజాభిమానం పొందింది. తమిళం, మళయాళం వంటి ప్రాంతీయ భాషల్లోకి అనువదించబడి పలు ప్రదర్శనలతో ప్రచారం పొందింది. అనిశెట్టి ప్రమేయంతో గిడుతూరి సూర్యం రూపొందించిన నృత్యమూకాభినయం. మానవుడు - చిరంజీవి' ఇండియన్ బ్యాలే సెంటర్ ఆధ్వర్యంలో 100 ప్రదర్శనలతో ప్రచారం పొందింది. ఇది తమిళం, మళయాళం, కన్నడం వంటి 8 ప్రాంతీయ భాషల్లోకి అనువదించబడింది. 1960లో సినీ రచయిత మహారథి ఇంగ్లీషులోకి అనువదించాడు. ఆంగ్లభాషలో 10 ప్రదర్శనలతో ప్రచారం పొందింది.

అనిశెట్టి తెలుగులో తొలిసారిగా 'గాలిమేడలు' నాటకంలో ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడు. అదే నాటకంలో ప్రేక్షకుల నుండి పాత్రలను ప్రవేశపెట్టాడు. తెలుగులో తొలి మూకాభినయం 'శాంతి'ని రూపొందించాడు. తొలి నృత్యమూకాభినయం 'రిక్షావాలా'ను ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టాడు. ఆయన ప్రయోగాలు తదనంతర రచయితలెందరికో అనుసరణీయాలు. ప్రయోగాత్మక నాటక రచయితగా అనిశెట్టి చిరస్మరణీయుడు.



# బలవన్విముక్తి

- మధుబాబు సూర్యదేవర
9550120123

ఇన్నాళ్లూ ఇన్నేళ్లూ
నా గుండె వాకిటనే
వేచి ఉన్నావు
ఎంత ఆపేక్ష నీకు
కాని దానికేం తెలుసు
నువ్వొక బూచి వంటూ
అమ్మ వొడిలో దాపెట్టింది
ఆ బాల్యం.
కాని దానికేం తెలుసు
నువ్వొక రాక్షసివని
నీ వంకే చూడవద్దని
పాఠం నేర్పింది
నే అడుగుపెట్టిన ఆ జీవితం.
ఎన్నాళ్లో ఎన్నేళ్లో
కళ్లు మూసేసుకున్నా గట్టిగా.
అయినా నువ్వు కనిపించావు
ఒక బలహీన క్షణాన
నా గుండె తలుపులు తెరుచుకువచ్చావు
ఇక చాలుపోదాం పదమంటూ
తొందరపెట్టావు.
ముచ్చెమటలు పోస్తున్నాయి
గొంతుపెగలటం లేదు.
అయినా అరుస్తున్నా
నేను రాను నేను రాను



ఇప్పుడేగా వచ్చిందంటూ
వెంటనే వచ్చేద్దామన్నావుగా ?
నిలదీశావు నువ్వు.
అప్పుడు గుర్తొచ్చింది
'ఒకసారి చూస్తానన్ను తీసుకుపో'
అంటూ అరిచి గీ పెడుతుంటే
వేగలేక సరేనంటూ తీసుకొచ్చావని
ఈ జీవితం చూపెడదామని !
మనసు ఏవో వుపాయాలు ఆలోచిస్తోంది.
'ఎలా వస్తానిప్పుడు
చూడుఎన్ని బంధాలో

అవి తెగని బంధాలు'
నిన్ను మభ్యపెట్టాలని యత్నం !
అప్పుడు నువ్వు నవ్వావు
నా అమాయకత్వాన్ని చూసి
జాలిగా నవ్వావు.
నీ నవ్వు నా గుండెను చీల్చుతుంటే
నీ నవ్వు నా మెదడును పేల్చివేస్తుంటే
విలవిల్లాడాను.
అంతలో ఏదో శబ్దం..
పుటుక్కున తెగిన శబ్దం !
అనిర్వచనీయ ప్రశాంతత!
సారీ బ్రదర్ అంటున్న ఒక స్వరం
బిక్కమొహం వేసిన ఒకరూపం
ఎవరిదో తెలియదు ఎవరో తెలియదు
కళ్ల ముందు ఏమిటది ?
తెరలు తెరలుగా.. వెలుగా? చీకటా??
ఏమో !
ఒక చల్లటి (బహుశ) స్పర్శ
నన్ను పొదువుకుని
ప్రేమ (?)గా తీసుకెళ్తోంది
- - - -
తిర్నాళ్లలో తిరిగి తిరిగి
అలసిన ఆ పిల్లాడి కళ్లు
మూతలుపడుతున్నాయి.

---

# నానీలు

- బమ్మిడి సుబ్బారావు
9440262515

చీకటి కొండల్ని
చీలుస్తున్నాయి
శ్రీకాకుళం చీమలు
మహాప్రస్థానం కోసం

ఏ దివ్య సుందరి
జారవిడిచిన
ధౌతవస్త్రమో
నయాగరా జలపాతం

కరచాలనం కాదు
ఖడ్గచాలనం
నేటి రాజకీయం
కపట ఖేలనం

అతడో
పెంపుడు మేధావి
ఏనాడూ తలూపడు
తోకూపుతాడు



గోరంత దీపం
తలెత్తేసరికి
కొండంత చీకటికి
అంతభయం ఎందుకో !

కథ

# దేవుళ్ళాట



- పి. శ్రీనివాస్ గౌడ్

9949429449

**ఆరోజు మిట్టమధ్యాహ్నం.. ఎండ నిప్పులు కుమ్మరిస్తుండగా.. మా కొబ్బరికాయల లారీ చెమటలు కక్కుతా.. ఆ గుడి ఆవరణలో ప్రవేశించింది. లారీ క్యాబిన్ లోంచి వడలిన తోటకూర కాడల్లా కిందకి దిగాం నేనూ, సంధ్యత్త, సీతమ్మ. 'మాకే ఇట్టుంటే.. వెనక కొబ్బరికాయలకాడున్న భద్రయ్య ఎట్టున్నాడో'ననుకున్నా ఒళ్ళిరుచుకుంటా. "ఒళ్ళు హూనం అయిపోయింది బాబా.." అన్నాడు భద్రయ్య లారీ దిగి వచ్చి. మా ఇంటి దగ్గర ఎరిగున్న మనుషులు భద్రయ్య, సీతమ్మ. ఆ మొగుడూ పెళ్ళాలిద్దరూ చేతి కింద సాయంగా వుంటారని, జీతానికి తెచ్చాం.**

చుట్టూ పరికించి చూసాను.

విశాలమైన గుడి ఆవరణ.. పది, పన్నెండు ఎకరాలుండొచ్చు... చుట్టూ ప్రహరీ... ఎంట్రన్సు దగ్గర పెద్దగేటు.. లోపల తారురోడ్డు.. రోడ్డు పక్కన బారుగా పెద్ద పెద్ద చెట్లు.. గుడి ఒక పక్కగా వుంది. పాతది. గుడికి ఎదురుగా పొడుగ్గా ధ్వజస్తంభం.. దానికి ఎడమ పక్కన ప్రహరీ గోడకి ఆనుకొని బారుగా రేకులషెడ్లు - పాతబడి... అది దాటితే.. వరసగా పెంకుటిల్లు.. అందులో ఎవరో నివాసం వుంటునట్టున్నారు.. దండేల మీద ధోవతీలు.. గావంచాలు.. పై కండువాలు.. ఆరేసున్నాయి.. గుడి పూజార్లవి కాబోలు...

ఇంతలో ఒకతను మా దగ్గరకు వచ్చాడు. పొట్టిగా...నల్లగా..ముఖాన బొట్టు.. బుగ్గన కిళ్ళీ... అమ్మా... మీరు.. అన్నాడు సందేహంగా

"నేనేనండి.. కొబ్బరి కాయల పాట పాడింది..." అంది సంధ్యత్త.

"మీరేనామ్మా... ఆహాఁ మీకోసమే ఎదురుచూస్తన్నామమ్మా... నాపేరు మల్లేశమమ్మా... ఆలయం కమిటీ మెంబర్ని.." అని లారీ డ్రైవర్ వేపు మళ్ళి.. ఆ పెంకుటిల్లు కనపటంలా... వరసగా... ఆఁ... అదిగో.. వాటిల్లో చివరి గది.. అక్కడ దింపు కాయలన్నీ" అన్నాడు పూజార్ల పెంకుటిల్ల వైపు చూపిస్తా.

భద్రయ్య వెళ్ళి ఆ ఇంటి తలుపు తీసాడు. రెండే గదులు... ఒకటి కొబ్బరి కాయలకనుకుంటా..గోడలు - మరకలు... మరకలుగా.. ఎండిపోయిన కొబ్బరి పీచుల్తో సహా బూజు పట్టి.. చూస్తంటే 'వామ్మో' అన్నట్టుంది.

భద్రయ్య, సీతమ్మలు.. గబగబా పక్కింటికెళ్ళి చీపిరి తెచ్చి, క్షణాల్లో గదులు శుభ్రం చేసారు. లారీల్లోంచి కొబ్బరికాయలన్నీ గోతాల్తో ఆ గదిలో చేరేసారు. గది దాదాపు సగం పైగా నిండిపోయింది. సంధ్యత్త ఈ లోపు వంట కానిచ్చింది.

లారీవోళ్ళు వెళ్ళిపోయారు. మల్లేశం కూడా సాయంత్రం వస్తానని వెళ్ళిపోయాడు. భద్రయ్య భుక్తాయాసంతో వసారాలో నడుం వాల్చాడు. అరువు తెచ్చుకున్న చాపల మీద బ్యాగుల్ని తలకింద పెట్టుకొని.. అలసిన ఒళ్ళుతో.. తెలీని ఆందోళన మెదులుతున్న కళ్ళతో..

సంధ్యత్తా, నేనూ చేరో పక్కా జారగిలపడ్డాం.

* * *

గుడిలోనే ఓ ప్రక్కగా, చిన్నగదిలో వుంది కమిటీ ఆఫీసు. నేనూ, సంధ్యత్త వెళ్ళేసరికి అక్కడ మల్లేశంతో పాటు ఇంకా ఐదారుగురు వ్యక్తులూ... గుడి పూజార్లూ కూర్చొని వున్నారు. మల్లేశం వాళ్ళని పరిచయం చేసాడు. ఇద్దరు ఆలయం ధర్మకర్తలు... ఒకాయన కమిటీ సెక్రటరీ.. మిగతావాళ్ళు మెంబర్లు... పూజార్లు.. ముగ్గురూ అన్నదమ్ములంట... మూడు తరాల్నుంచి గుడిలో అర్చకత్వం చేస్తున్నారంట.. అందరూ.. అంటీ అంటనట్టుగా... తెచ్చిపెట్టుకున్న నవ్వుతో... ఒక రకంగా వున్నారు.

కమిటీ సెక్రటరీ ఏవో కాగితాలు బయటికి తీసి "ఇదిగో.. ఇక్కడ సంతకం పెట్టమ్మా..." అన్నాడు.

"శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున స్వామి వారి ఆలయం కొబ్బరికాయల వేలంపాట 2011-12 సంవత్సరానికి లక్ష రూపాయల ధరావత్తుకి శ్రీమతి సంధ్యాకుమారి వైఫ్ ఆఫ్ పాండురంగారావు గారు పాడారని, బయానాగా యాభైవేల రూపాయలు ముట్టాయని, మిగతా యాభైవేలు రెండు వాయిదాలుగా ఆఖరి మూడు నెలల ముందే జమ చేయాలని.. లేని యెడల ప్రభుత్వం వారు తీసుకొనే చర్యలకు బాధ్యత వహించాలని" ఆ కాగితాల్లో వుంది. సంధ్యత్త సంతకం పెట్టి ఇచ్చింది.



"అమ్మా.. ఈ సంవత్సర కాలం మీరా పెంకుటింట్లో నుబ్బరంగా వుండొచ్చు... కొబ్బరికాయలు.. పూజా సామాన్లు.. వచారి సామాన్లు.. కాశీదారాలు.. పిల్లల బొమ్మలు... అమ్ముకోవచ్చు. మీకేదన్నా కావాలంటే.. మొహమాట పడకుండా మమ్మల్ని అడగొచ్చు" అన్నాడు ధర్మకర్తల్లో ఒకాయన.

"ఏం పర్లేదమ్మా.. అంతా మల్లిఖార్జునుడి దయ.. మనదేం లేదు.. అంతా ఆయనే చూసుకుంటాడు.. ఏం పర్లేదు.." అన్నాడు మరొకాయన.

'సరే"నని చెప్పి బయటపడ్డాం. మల్లేశం వెంటే వచ్చాడు.

"మల్లేశం గారూ.. పోయిన సంవత్సరం కొబ్బరికాయల పాట ఎవరిదండి..?" మల్లేశాన్ని పెంకుటింటికాడ కూచోబెట్టి టీ ఇస్తా అడిగా.

"పోయిన సంవత్సరం ఏందండి? ప్రతి యేడూ కొబ్బరికాయల పాట ఆ పూజార్లదే... ఈ సంవత్సరమేగా మీకొస్తా..." మల్లేశం కాస్త గొంతు తగ్గించి చెప్పాడు.

"ఏందీ.. మొన్నటిదాకానా..?" ఆశ్చర్యపోయాను.

"అవునండీ... ఈ గుడి ప్రభుత్వంలో కలవక ముందు నుంచీ... అంటే వాళ్ళ తాతల కాలం నుంచి ఈ గుడి వీళ్ళ కిందే వుంది. నాకు తెలిసి.. ఈ పాటలొచ్చాక.. వీళ్ళే చవగ్గా పాడుకొని.. వీళ్ళే అమ్ముకుంటా వున్నారు. ఈ సంవత్సరం ఈవొగా ఒక కొత్తాయన వచ్చాడు. ఈ పాటల యవ్వారమంతా పేపర్లలో ప్రకటనలు ఏయించాడు. ఈ పాటల మీద తిరిగేవోళ్ళందరికీ.. ఈ గుడి మీద కన్నుపడేట్టు చేసాడు. లేకపోతే మీరెట్టా వచ్చేవోళ్ళు..? ఇరవై వేలకున్నాడా కటకటలాడే పాట.. లక్ష రూపాయలకెట్టా పాడే వోళ్ళూ...? చెప్పండి"

"సరేగానీండి మల్లేశం గారూ.. ఇక్కడ జాతరేదో జరిగిద్దంట గదా.. ఆ రోజు ఏ మాత్రం పోతాయండి కాయలు..?"

"అబ్బో.. చిన్నగా అంటారేందండి.. మామూలు జాతరా..? ఈ చుట్టు పక్కల ఊర్ల జనమంతా ఆరోజు బండ్లు కట్టించుకొని వచ్చేస్తారు. ఇసకేస్తే రాలదారోజు. సంవత్సరం అంతా అమ్మింది ఒకెత్తు.. ఆ ఒక్కరోజు అమ్మింది ఒకెత్తు.."

"అయితే... ఆ రోజు రెండు లోడ్లకాయలు పోతాయాండి...?" సంధ్యత్త ఆబగా అడిగింది.

రెండు లోడ్లా.. లెక్కలేకుండా పోతాయి.." అన్నాడు మల్లేశం ధీమాగా మొకంపెట్టి.

"మీ నోటి వాక్కువల్లయినా అట్టా జరిగితే.." సంధ్యత్త ఊహలోకెళ్ళి చూపులు ఎక్కడో నిలిపింది.

"ఏం పర్లేదు లేమ్మా.. మీ డబ్బులన్నీ జాతర్లలోనే తేలిపోతాయి.." అన్నాడు మల్లేశం తేలిగ్గా.

ఊరు గాని ఊరొచ్చి ఎట్ట నెగ్గుకొస్తాంరా.. అని గుబులు గుబులు పడుతున్న మాకు మల్లేశం మాటలు జీవం పోశాయి.

* * *

జాతర ఇంక పదిహేను రోజులకొచ్చింది.. రా..రా..' అని సంధ్యత్త ప్రాణం తీస్తుంటే నేను ఊర్నుండి మళ్ళీ వచ్చాను.

"ఏం చేద్దాం రా కరుణా.. ఇంకో రెండు లోడ్లు తెప్పిద్దామంటావా..?" మల్లేశం ఆ మాట అన్నాకాడ్నుంచి సంధ్యత్త కాళ్ళు ఒక్కచోట నిలవడం లేదు. మనిషికి ఒకటే కంగారు....

ఇక్కడ ఈ గుళ్ళో మామూలు రోజుల్లో బేరం అంతంత మాత్రమే.. ఐదొందలు అమ్మితే గొప్ప! ఆదివారాలు.. సెలవు రోజులు.. పండగల రోజులైతే మాత్రం.. కాస్త సుమారుగా వుంటుంది.

"ఉండత్తా.. తొందర పడమాకు.. ఇప్పటికే మన దగ్గర లోడు కాయలున్నాయి... అంటే దాదాపు ఆరువేలు కాయలు.. ఇంకో రెండు లోడ్లంటే మొత్తం పద్దెనిమిది వేల కాయలు.. ఒక్క రోజులో ఇన్ని అమ్ముడుబోవడం అంటే మాటలా..? ఆలోచించు..."

"జాతర రోజు రెండు లోడ్ల పైనే పోతాయంటున్నారు కదరా... అందరూ.."

"పోతే మంచిదే అత్తా.. లేకపోతే ఏంటి పరిస్థితి.. కాస్త

ఎనకా ముందూ ఆలోచించు.."

సంధ్యత్త ఏం మాట్లాడకుండా, మౌనంగా ముఖం తిప్పుకొని కూచుంది. అంటే అలిగిందన్న మాట.

సంధ్యత్త స్వయానా మా నాన్న చెల్లెలు. అస్తమానం అనుమానం మొగుడితో వేగలేక.. తెగతెంపులు చేస్కొని, ఇద్దరు పిల్లల్తో ఇంటికొచ్చేసింది. అమ్మానాన్నలు సంధ్యత్త కాపురం పోయినా సహించారు గానీ, అమ్మలక్కల సూటీ పోటీ మాటలు సహించలేకపోయారు. ఏం అనుకుందో - ఒకరోజు పిల్లల్తో - పక్క ఊర్లో వుద్యోగం చేస్తున్న నా దగ్గరకు వచ్చింది. 'సరే... ఒంటిగాణ్ణేగా.. నా దగ్గరే వుండత్తా' అన్నా వినలా. 'నువ్వయినా.. వాళ్ళయినా ఒకటే'నని ఎంత చెప్పినా వినకుండా, విడిగానే వుంటానంది. అన్నట్టే.. ఒక చిన్న ఇల్లు చూసుకొని.. అందులోకి మారిపోయింది. ఏవేవో చిన్న వ్యాపారాలు చేస్తా.. మిషను కుడతా.. పిల్లల్ని చదివిస్తా.. బతుకు బండిని పౌరుషంగా లాక్కొస్తావుంది.

ఇంతలో ఇక్కడ తగిలాడో ఏడుకొండలు– 'అక్కా..అక్కా' అంటా సంధ్యత్తని బుట్టలో వేసాడు. ఆ ఏడుకొండలు గాడు మహా మాటకారి. పందిని నందినీ, తిమ్మిని బమ్మినీ చేయగల సమర్థుడు.' అక్కడ గుడిపాటల్లో ఇంత లాభం వస్తుంది' అని ఊరించి, సంధ్యత్త అవసరాన్నీ, అమాయకత్వాన్నీ ఆసరా చేసుకొని, మెల్లగా ఆమెకి గుడిపాటల పిచ్చి అంటించాడు.



భక్తుల రద్దీ ఎక్కువగా వున్న ఆలయాల్ని ప్రభుత్వం ఎండోమెంట్ (దేవాదాయ, ధర్మాదాయశాఖ) కింద కలుపుకొని తన ఆధీనంలో వాటిని నిర్వహిస్తా వుంటుంది. వాటి అజమాయిషీకి కొంతమంది ఈ.వొ.ల్ని నియమించి, వాళ్ళ ఆధ్వర్యంలో గుళ్ళలో వినియోగించే వస్తువుల్ని ఆ ప్రాంగణంలో అమ్ముకోవడానికి వేలంపాటలు నిర్వహించి, వాటిద్వారా ప్రభుత్వం ఆదాయం సమకూర్చుకుంటా వుంటుంది. కొబ్బరికాయల పాటనీ, కొబ్బరి చిప్పలపాటనీ, తలనీలాల పాటనీ, ప్రసాదాల పాటనీ, పప్పుబియ్యాల పాటనీ, చీరల పాటనీ.. ఇలా రకరకాలుగా.. ఒక్కొక్క గుళ్ళో ఒక్కోరకంగా అక్కడి ఆచారాల్ని బట్టి, వస్తువుల వినియోగాన్ని బట్టి.. పాటలు నిర్వహిస్తావుంటారు. బాగా రద్దీగా వుండే తిరుపతి, విజయవాడ, అన్నవరం, శ్రీశైలం, కాణిపాకం... లాంటి పెద్ద పెద్ద గుళ్ళల్లో పాటలు మామూలు వాళ్ళకి అందవు. అక్కడ 'పెద్ద తలకాయలు' దిగిపోతాయి. గుడి పాటల్లో పోటీ వుండేది కొబ్బరికాయలకి... తలనీలాలకే...

ఏడుకొండలు చిన్న చిన్న గుళ్ళల్లో తలనీలాల పాట పాడుతుంటాడు. బాగా పోటీ వుండే కొబ్బరికాయ లాంటి పాటలకి... ఆ పాట కోసం వచ్చినోళ్ళందరితో కలిసి 'రింగు' కడతాడు. పాట గట్టిగా కావాలనుకున్నవాళ్ళు... మిగతా పోటీదారులకి లోపాయికారీగా ఎంతో కొంత ఇచ్చి, పోటీకి రాకుండా చేసుకొని.. పాట తక్కువకి పాడుకుంటారు. అలా రింగులు సంపాదిస్తున్న ఏడుకొండలు.. పెద్ద పాటలకి అడ్వాన్సులు సంధ్యత్త చేత పెట్టించి.. వచ్చేది చిలక్కొట్టుడు కొడతా పబ్బం గడుపుకుంటా వున్నాడు. 'పదో పరకో' కళ్ళజూస్తన్నాం కదాని ఏడుకొండలుగాడు ఎట్ట చేయమంటే అట్ట చేస్తావుంది. సంధ్యత్త. ఈ లెక్కనే ఎంతో కొంత కమీషన్ కొడదామని చెప్పి, సంధ్యత్తని ఇంతదూరం ఇక్కడి గుడికి తీసుకువచ్చాడు ఏడుకొండలు. నాకు చెబితే, నేనెక్కడ అడ్డుపుల్ల వేస్తానేమోనని నాకు చెప్పనీయకుండా చేసాడు. అక్కడ ఏం తంత్రం వేసాడో గానీ.. సంధ్యత్త చేత లక్ష రూపాయలు పాట పాడించాడు. యాభై వేలు బయానా కట్టించి.. చిన్నగా జారుకున్నాడు. పాపం... సంధ్యత్త..! ఎక్కడెక్కడి డబ్బులు పోగేసి.. అప్పులు తెచ్చి బయానా కట్టింది.

కొబ్బరికాయలు, సరుకులు కొంటానికి డబ్బుల్లేక నన్ను అడిగింది. అక్కడికి నన్నూ రమ్మంది. 'ఒక్కతే అక్కడ ఏం ఇబ్బందులు పడుద్దో.. అసలే చాలా ఎక్కువ పెట్టి పాడిందని' సరే.. నేనూ నీతో వచ్చి, జాతర రోజు వుండి, నా పెట్టుబడి నేను తిరిగి తీసుకుపోయే షరతు మీద ఇస్తానన్నా'ను. 'సరే' నంది.

* * *

జాతరకు ఒకరోజు ముందే రెండు లోడ్ల కొబ్బరికాయల్తో గుడి దగ్గర దిగాను. కాయలన్నీ రెండు గదులకి సరిపోయాయి. గుడి దగ్గర ఊళ్ళోకి వెళ్ళి కావాల్సిన సరుకులన్నీ కొనుక్కువచ్చాను.

జాతరరోజు పొద్దున్నుంచే హడావుడి మొదలైంది. గుడి ఆవరణ అంతా అక్కడొక మైకు.. అక్కడొక మైకు పెట్టారు. చెట్టుకొక ట్యూబ్‌లైటు.. మధ్య మధ్యలో పెద్ద పెద్ద మెర్క్యురీలైట్లు తగిలించారు. మధ్యాహ్నం దాటేసరికల్లా.. భక్త జనం పిల్లాజెల్లాతో... కోళ్ళూ మేకలతో గోలగోలగా రావడం మొదలైంది. ఓ చోటు చూసుకొని, మూడు రాళ్ళు పోగేసి.. ఎండు పుల్లల్తో వంట వండుకోవడం మొదలుపెట్టారు.

నేను పొద్దున్నే కొబ్బరికాయల్ని భద్రయ్య చేత ఒలిపించి, పసుపూ కుంకుమ, అగరొత్తులు, నెయ్యి పాకెట్లు అన్నీ పాకెట్లు చేసి వుంచాను. పిల్లల బొమ్మలు, కాశీ దారాలు, పచారీ సామాన్లు రడీగా వుంచాను.

కొద్దికొద్దిగా సరుకు అమ్ముడవుతోంది కానీ, కొబ్బరికాయలు కదలట్లేదు.

నెమ్మదిగా చీకటి అలుముకుంటోంది. చీకటి పడిన తర్వాతే జాతర...

ఏం తోచట్లేదు. మనసులో ఏదో శంక.. ఊపిరాడుతున్నట్టు లేదు. గుడి గేటు దాటి బయటకు వచ్చాను. గుడికి వచ్చే దారిలో అక్కడక్కడ ఇళ్ళ ముందు కొబ్బరికాయలు పెట్టి అమ్ముతున్నారు నా అనుమానం నిజమయ్యింది. ఇట్టయితే లాభం గూబలోకి వచ్చినట్టే-

మల్లేశాన్ని వెతుక్కుంటూ కమిటీ ఆఫీసుకి వెళ్ళా. లేడు. ధర్మకర్తల్లో ఒకాయన కనపడితే విషయం చెప్పా.

ఆయన నవ్వి "ఆలయం లోపల పెడితే పెట్టనివ్వంగానీ, వాళ్ళింటి ముందు వాళ్ళమ్ముకుంటే మనం ఏం చెయ్యగలమండీ..?" అన్నాడు నింపాదిగా

చేసేది లేక భద్రయ్యకి, సీతమ్మకి కొన్నికాయలిచ్చి ఎంట్రన్సు గేటు దగ్గర కూచోబెట్టాను. నేనూ, సంధ్యత్త వసారాలో కొబ్బరికాయలు పేర్చి.. బొమ్మలు.. దారాలు చమ్కీదండలు.. అన్నీ కనపడేట్టు వేలాడగట్టి కూర్చున్నాము.

రాత్రయ్యేసరికి జన సందోహం ఎక్కువయిపోయింది. గుడి ఆవరణంతా పూజార్ల మంత్రాలతో మైకులు మార్మోగిపోతావున్నాయి. మా బేరం కూడా మెల్లగా ఊపు అందుకుంది.

భక్తులు గుళ్ళో పోటెత్తుతున్నారు. మా దగ్గరకు రాకుండానే నేరుగా గుళ్ళోకి పోతున్నారు. వచ్చేప్పుడు కొబ్బరి చిప్పల్తో బయటకు వస్తున్నారు. నాకేం అర్థం కాలేదు. మా దగ్గర కొనకుండా వాళ్ళకి కొబ్బరికాయలెక్కడివి..? ఎందుకు వాళ్ళు మా దగ్గరికి రావడం లేదు..?

అర్థరాత్రి అవుతున్న కొద్దీ మా బేరం బాగా పల్చబడిపోయింది. నేరుగా గుళ్ళోకి పోయి కొబ్బరికాయకొట్టే వాళ్ళ సంఖ్య ఎక్కువయిపోయింది.



మా దగ్గర వేలాదికాయలు మిగిలిపోయాయి. నాకు అదుర్దా పెరిగిపోతోంది. సంధ్యత్త మొకంలో అయితే నెత్తుటి చుక్కలేదు.

చూస్తా వుండలేక.. అసలు విషయం ఏందో కనుక్కుందామని.. నేరుగా గుళ్ళో కొబ్బరికాయలు కొట్టేసి వస్తున్న వాళ్ళ దగ్గరికి వెళ్ళా–

"మీ కాయలు బాగున్నాయండీ.. ఎక్కడ కొన్నారు..?" అని అడిగా.

"యాడా కొనలేదండీ.. మా ఊర్నుండే తెస్తా..." అన్నాడు వాళ్ళల్లో ఒకాయన.

"అదేందండి..? ఇక్కడ అమ్ముతారుగా... మీ ఊర్నుండి ఇక్కడ దాకా మోత బరువెందుకు..?" అన్నా ఏం అర్థంకాక

"పోయినేడు ఈడే కొన్నామండీ.. ఈ యేడు.. ఇక్కడ కొబ్బరికాయలు అమ్మరు. ఊళ్ళోంచే తెచ్చుకోవాలని అన్నారండీ.. అందుకని ఊరోళ్ళమంతా మా కొబ్బరికాయలు మేమే తెచ్చుకొని.. దేవుడికి కొడతన్నామండి.."

అది విని నా తల గిర్రున తిరిగింది. నోట మాట రాలేదు. 'ఎవరు చెప్పారని' కూడా అడగలేనంత నీరసం నిలువెల్లా ఆవహించింది. నిస్సత్తువగా పక్కనున్న ఒక చప్టా మీద కూలబడ్డాను.

* * *

నల్లగా అయిపోయిన మా మొఖాల మీదుగా తెల్లగా తెల్లారింది. చెదిరిపోయిన మనసులతో చెదురుమదురుగా చెల్లాచెదురుగా పడిపోయున్న కాయలన్నీ భారంగా లెక్కేస్తున్నాం... నేనూ.. సంధ్యత్త.

భద్రయ్యా.. సీతమ్మ.. కనపడటం లేదు.. ఎక్కడ చచ్చారో.. కాయలులెక్కేయకుండా...

ఒక లోడుకాయలు మిగిలిపోయాయి. కొన్ని ఒలిచినవి. కొన్ని అదృష్టం కొద్దీ ఒలవనివి.. అవీ, ఇవీ విడివిడిగా వేస్తున్నాం. ఒలిచినవి నిలవుంచితే కుళ్ళిపోతాయి. కుళ్ళిన కాయల పక్కన మిగతా కాయలూ కుళ్ళిపోతాయి.

నాకు మనసంతా భగ్గుభగ్గుమంటోంది. ఎవరిమీదో తెలియని కసి, నాకు తెలియకుండానే పళ్ళు నూరుకోవడంలో తీర్చుకుంటున్నాని నాకు తెలుస్తూనేవుంది.

భద్రయ్య.. వాడ్ని తలుచుకుంటేనే.. కంపరంగా వుంది. రాత్రి ఏం చేసాడు..? మనసులో అదే దృశ్యం.. సుళ్ళు తిరుగుతూ...,

నిన్న అర్థరాత్రి దాటిన తర్వాత అనుకుంటా.... జరిగిందా సంఘటన.. గుడి లోపల బేరం లేదు. ఏం తోచక చిరాకు చిరాగ్గా అలా గుడి బయట గేటు దగ్గరకు వచ్చా.

అక్కడ భద్రయ్య లేడు. సీతమ్మ ఒక్కతే కునికిపాట్లు పడతా వుంది.

"సీతమ్మా... సీతమ్మా..." తట్టి లేపాను. తత్తరపడి లేచింది.

''ఏడీ భద్రయ్య...? ఎక్కడికెళ్ళాడు..? ఎంతకమ్మేరు..?"

సీతమ్మకి మత్తు పూర్తిగా వదిలి, నీళ్ళు నములుతోంది.

''భద్రయ్య ఏడంటే.. మాట్లాడవేందమ్మా..?"

"ఆయన..ఆయనా.. బాబూ..."

'అప్పన్నతనామనా... అప్పన్నాతన్నామనా.. అందరికీ దండలన్నా... తాగినోడి నోట నిజం తన్నుకొని వస్తాదన్నా.. అప్ప..' పాడుకుంటా తూలుకుంటా వస్తున్న భద్రయ్య నన్ను చూసి నాలుక కొరుక్కొని.. పాట ఆపేసాడు.

గుప్పున కొట్టింది మందు వాసన.

భద్రయ్యని ఆ స్థితిలో చూసేసరికి.. ఛర్రున కోపం నడినెత్తికి కొట్టింది.

"ఏంది భద్రయ్యా.. కాయలమ్మమంటే అమ్మకుండా యాడ తిరిగొస్తున్నావ్...?

ఆc.. ఇంతకీ ఎంతకమ్మావ్..?" నా మాట నాకే విసురుగా వినిపించింది.

"బాబూ.. మీరు కాయ పదికి అమ్మమన్నారు.. పదికి ఈడ ఎవడూ కొంటంలా... హిక్.. అందుకే హిక్.. ఐదు చేసి అమ్మేసాం... ఏవే.. హిక్' అన్నాడు భద్రయ్య చివర్లో పెళ్ళాంకేసి దీర్ఘంగా చూసి...

"ఆc...ఆc.. అవును బాబు..." పెళ్ళాం వంత పాడింది.

ఛీ...! ఇంత తేలిగ్గా అబద్ధాలు చెప్తారా..? భద్రయ్య తాగి

రావడం కన్నా... 'నాకే' అబద్ధం చెప్పడం భరించరానిదిగా వుంది నాకు.. అసలే బేరం లేదనే తిక్క మీద వున్నాను...

"భద్రయ్యా... ఏదీ... అమ్మిన డబ్బులిలా ఇయ్యి.."

"బాబూ..మరి..మరి... డబ్బులు.. బ్రాందీ షాపు కాడ ఎవడో కొట్టేశాడు బాబూ..హిక్..హిక్..."

ఏం చేస్తున్నానో తెలియనంత ఆవేశం వచ్చేసింది నాకు.. భద్రయ్య గూబ గుయ్యిమంది. ఆ దెబ్బతో కిందపడి బిత్తరపోయాడు భద్రయ్య... లేవాలని ప్రయత్నించి.. లేవలేక తూలుతున్నాడు...

మళ్ళీ ఇంకోటి ఇచ్చేలోపు సీతమ్మ నాకాళ్ళ చుట్టేసుకుంది. "బాబూ.. వద్దు బాబూ.. వదిలెయ్ బాబూ.." అని...

జరిగిన దాంట్లోంచి బయటకు రాలేక పోతున్నా.. తల దిమ్ముగా వుంది గట్టిగా విదిల్చాను.. ఉహు ఆలోచనలు మళ్ళీ మూగుతున్నయ్...

ఎక్కడ చచ్చారు.. ఈ భద్రయ్య.. సీతమ్మ..

అంతలో విశాలాక్ష్మి గారు వచ్చారు. ఆవిడ ముఖం కాస్త నలిగిపోయి వుంది. సంధ్యత్త హడావుడిగా చాప తెచ్చివేసింది. ఆవిడ మౌనంగా కూర్చుంది.



విశాలాక్షి గారు ఆ గుడి పెద్దపూజారి గారి భార్య. మా పక్క ఇంట్లోనే వుంటారు. చిటికీ మాటికీ.. ఉప్పుకీ పప్పుకీ ఆవిడే మాకు సాయం...

"ఏమ్మా.. సంధ్యా.. రాత్రి బేరం ఎలా అయ్యింది...?" విశాలాక్షి గారు గొంతులోంచి మాట పెగులుచ్చుకొని అడుగుతున్నట్టు అడిగారు. సంధ్యత్త ఏం మాట్లాడలేదు. మొకం కనిపించకుండా నేలచూపులు చూస్తా వుంది.

గట్టిగా నిట్టూర్పు విడిచారు విశాలాక్షి గారు. ఎప్పుడూ పెదాల మీద వుండే చిరునవ్వు మాయమైంది.

"ఏం చెప్పాలో.. ఎలా చెప్పాలో తెలియడం లేదమ్మా.. మిమ్మల్ని చూస్తే చాలా బాధగా వుంది. మాలో మాకు ఎన్నున్నా ఇంతకాలం ఎట్టనో నెట్టుకొచ్చాం... తరతరాలుగా వస్తున్న అర్చకత్వం.. వదులుకోలేక.. అటు బయటకెళ్ళి బతకలేక.. ఇటు ఈ ఆఫీసర్ల ధాటికి తట్టుకోలేక.. ఎంత నలిగిపోతున్నామో ఆ భగవంతుడికి తెల్సు..." విశాలాక్షి గొంతు జీరపోయింది.

"....గుడిలో వచ్చింది.. అమ్మింది ఏదైనా.. మూడు వాటాలు.. తలో సంవత్సరం చేయాలని అనుకున్నాం... ఈ సంవత్సరం మా వంతు.. మేం చేయాలి.. ఆ వచ్చిన గుడి మీద కొత్త ఆఫీసరుకి మాకు కమీషన్ దగ్గర తేడా వచ్చి.. ఎందుకో పొసగలేదు. పోనీ ఎలాగో ఒకలాగ చేద్దామంటే.. మా ఖర్మకొద్దీ.. హాస్టల్లో చదువుతున్న మా అమ్మాయికి.. గుండెల్లో రంధ్రం పడింది.. లక్షల్లో ఖర్చు మీదపడింది.. అంత ఇవ్వలేమండీ.. ఇదండీ పరిస్థితి అని చెప్పుకున్నాం ఆయన గారికి.. ఆయన మనసు కరగలేదు సరికదా.. 'ఛాత్.. నాతో కథలు చెబుతారా.. మీ సంగతి నాకు తెలియదా..? ఇన్నాళ్ళు గుళ్ళ మీద తిన్నదంతా ఏం చేసారు..? నాకే ఎదురు చెపుతారా.. చూడండి.. ఏం చేస్తానో..' అని మా మీద కోపగించారు. ఎవరు చెప్పినా వినలా. బయటవాళ్ళని పాటలకి పిలిచారు. అప్పటికీ మా మరుదులు వాళ్ళ మనుషుల్ని పెట్టి పాట పాడియ్యాలని చూసారు గానీ... వాళ్ళకి పాట అందలా.. మీరు ఎక్కువ పెట్టి పాట పాడేసారు.." విశాలాక్షి గారు చెప్పడం ఆపి ఒక్క నిమిషం మా వంక చూసారు. ఆ చూపులో లీలగా అపరాధ భావం..

"...మీరొచ్చారు... 'మీరొచ్చి ఇక్కడ పాతుకుపోతే.. మా నోటి కాడ కూడు పోతుంది కదా.. ఆదాయమంతా ఉత్తి పుణ్యానికి గవర్నమెంటుకి వెళ్తుంది కదా..' అని గుడి మీద ఆఫీసర్లూ, కమిటీ మెంబర్లు, మా వోళ్ళూ.. అందరూ కలిసి తెగ ఇదయిపోయారు. ఎట్టయిన మిమ్మల్ని ఎట్టా వచ్చారో అట్టా వెనక్కి పంపాలని ఆలోచించారు. అందుకే.. ఊళ్ళల్లో ఈ సంవత్సరానికి కొబ్బరికాయలు మీరే తెచ్చుకోండని చెప్పొచ్చారు.. బేరం లేకపోతే మీరు మాత్రం ఎంతకాలం వుంటారు..? అదిగో.. మీ కూడానే తిరుగుతున్నాడే.. మల్లేశం... అతనిక్కూడా తెలుసు.. ఈ భాగోతం అంతా.. ఇన్నాళ్ళుగా ఆ దేవుణ్ణే నమ్ముకొని వున్నాం... ఆ దేవుడి సొమ్మేగా తింటున్నాం... అనుకున్నాం.. కానీ.. ఇప్పుడు.. చేసింది.. ఊరికే పోతుందా.. అందుకే భగవంతుడు వెంటనే చూయించాడు.. కడుపుకోత పెట్టి..." విశాలాక్షి గారి కళ్ళమ్మెట నీళ్ళు జలజలా రాలాయి. ఏడుపు బయటకి రాకుండా చెంగు అడ్డం పెట్టుకుంది. కొంతసేపటికి తమాయించుకొని..

"మా అమ్మాయికి ఇంతకాలం బయట పడలేదా జబ్బు.. ఇప్పుడే బయట పడింది.. ఆపరేషన్ చెయ్యకపోతే బతకదంటున్నారు.. లక్షలు పోసినా బతికిద్దో.. లేదో.. ఇది విన్న దగ్గర్నుంచి ఆయన ఒకటే బాధపడిపోతన్నారు.. నిన్నట్నుంచి అన్నం కూడా ముట్టలా.. మీ దగ్గర ఆయనకి మొకం కూడా చెల్లడం లేదు... చేసిన పాపం చెబితే కాస్తయినా పోతుందంటారు కదా.. అందుకనే మీకు చెప్పేసానమ్మా.. మా బిడ్డ క్షేమంగా వుంటే అంతే చాలమ్మా.. అంతే చాలు.." అంటా విశాలాక్షి గారు మా సమాధానం కోసం కూడా చూడకుండా దబదబా వెళ్ళిపోయారు.

* * *

ఒలవనియి అడుగున వేసి ఒలిచినవి పైన వేసాం.. లారీలో... ఒలిచిన కాయల్లో కొన్ని కుళ్ళి పోతున్నాయి. సుబ్బయ్యశెట్టి నాసిరం సరుకు అంటగట్టినట్టున్నాడు.. ఇప్పుడీ కుళ్ళిన కాయలు తిరిగి తీసుకోడు.. ఎంత నష్టం వచ్చిందో లెక్కలేస్తుంటే.. నాకు భలే అసహనంగా వుంది.. పైగా పుండు మీద కారం చల్లినట్టు.. ఈ లారీ బాడుగొకటి .. దండగ..

## మనిషిని చేసే గీతం కోసం

-డా॥ తిరునగరి



చాలులే
ఈ వెన్నెల పాటలు
జాతర పాటలు
జావళీలు
సారంగీలు
సమయంకాదిది
భువన విజయాలకు
అవధానాలకు
సంగీత కచేరీలకు
ముషాయిరాలకు
ఇక్కడ
కడుపులు కాలిపోతున్నై
గుడిసెలు తగలబడుతున్నై
నిర్మాణాలు పేలిపోతున్నై
పునాదులు కదిలిపోతున్నై
పాశవికత నృత్యం చేస్తోంది
దానవతరాజ్యం చేస్తోంది
కాము నోళ్ళు తెరుస్తోంది
మృగత్వం తాండవిస్తోంది
ఇది ఉద్రిక్త సమయం
ఇది ఉద్వేగసమయము
ఇది విహ్వలవేళ
ఇది విధ్వంసహేల
ఈవేళ
ఎవడిక్కావాలి నీ మోహనరాగం!
ఎవడిక్కావాలి ఈ మధుర సంగీతం !
ఎవడిక్కావాలి కృష్ణశాస్త్రి భావగీతం?
ఎవడిక్కావాలి గాలిబ్ గజల్ సౌందర్యం
ఈ వేళ
ముందు మృగాన్ని
మనిషిని చేయాలి
మనిషిలో మానవత ఉంటేనే కదా
ఈ కళలన్నీ
వెలగాలి
మనిషిలో మానవత్వాన్ని మేల్కొల్పే
సాహిత్య దీపాలు
కావాలి
లోకాన్ని కారుణ్యం వైపు మళ్ళించే
భావగీతాలు
రావాలి
శోకాన్ని తొలగించే, లోకాన్ని వెలిగించే
ఉషోగీతాలు
ఇక చాలులే
ఈ జావళీలు
సారంగీలు
ఈవేళ పాడు
ఈ సమాజాన్ని సంస్కరించే
చైతన్య గీతాలు.

---

ఇంతకీ.. భద్రయ్య.. సీతమ్మలు ఎక్కడికెళ్ళినట్టు.. పొద్దుట్నుంచి కనపడటం లేదు... సంధ్యత్త పెద్దగా ఎవరితో మాట్లాడటం లేదు. ముభావంగా ఉంటోంది. నా వంక చూసి మాత్రం బలవంతంగా నవ్వుతోంది. ఆమె మనసులో మాత్రం అగ్ని పర్వతాలు బద్దలవుతూ వుంటాయని నాకు తెలుసు.

"అమ్మా.. వెళ్దామా" లారీ డ్రైవర్ తొందర పడుతున్నాడు.

ఈ భద్రయ్య, సీతమ్మ ఎక్కడికెళ్ళారు..? ష్..

భద్రయ్య...భద్రయ్య గుర్తొచ్చాడు. భద్రయ్యను కొట్టడం పదే పదే గుర్తొస్తోంది. 'భద్రయ్య చేతికింద వాడనేగా చెయ్యి చేసుకున్నాను. మరి.. జరిగినదానికి ఎవరి మీద కొట్లాడాలి? పూజార్లనా.. కమిటీ మెంబర్లనా.. గుడి మీద ఆఫీసర్లనా... వాళ్ళ పై వోళ్ళనా. ఎవర్నని అంటాం..? ఏమని అంటాం..? ఎవడూ మనముందుకు వచ్చి.. మనకి చెప్పి మాయ చేయడు. అంతా అదృశ్యంగా.. తెరవెనుక.. జరిగిపోతావుంటుంది. అసలు.. ఎవరా తెర వెనుక శత్రువు.. ఎవరా కనిపించని శత్రువు..? ఎక్కడో వుండి చావుదెబ్బతీసే ఈ శత్రువుని ఎట్టా ఎదురొడ్డి నిలవడం..? ఏ ఆధారం లేని తమలాంటి వాళ్ళు చివరికి చితికి పోవాల్సిందేనా...? జీవిక కోసం దేవులాడాల్సిందేనా..? ఈ వ్యవస్థ ఆడే ఆటలో సమిధలుగా మిగిలిపోవాల్సిందేనా..? ఎక్కడో ఏదో తెగిపోతోంది.. మనిషికీ మనిషికీ మధ్య వుండాల్సినదేదో.. అదృశ్యమైపోతోంది..'

నా మొకంలో ఆందోళన గమనించినట్టు నా భుజం మీద చెయ్యేసింది సంధ్యత్త–" "పెద్ద పౌరుషం వున్నదాన్లాగ పిల్లల్ని బయటకు తీసుకొచ్చి, బతికి చూపిస్తానని ప్రగల్భాలు పలికాను కదా.. ఇక్కడన్నా నాలుగు రూపాయలు మిగిల్తే.. నలుగురి ముందు తలెత్తుకొని బతకొచ్చని ఆరాటం రా.. కరుణా.. ప్చ్.. ఏం చేస్తాం.. ఇంతకన్నా. కాకపోతే. మళ్ళీ మొదలు.. మళ్ళీ.. దేవులాట..' అంది మొఖం మీద బాధ కొంకర్లు పోతుండగా నా దగ్గర మాటల్లేవు.

కొంతసేపటి తర్వాత సంధ్యత్త తన్ను తాను సంభాళించుకొని... కళ్ళల్లో ఏర్పడ్డ నీటి పొర చిరగకుండా వుండటానికి శత ప్రయత్నం చేస్తూ...

"ఎందుకొచ్చామో.. సముద్రం మధ్యలోకి వచ్చాం.. పడవకి చిల్లుపడి మునిగిపోతన్నాం.. చిల్లు పూడ్చుకొని ముందుకు పోవాలి గానీ.. మునిగిపోతా అక్కడే వుంటామా..? ముందుకు పోక తప్పదు కదా.. పద".. అని లారీ ఎక్కి కూర్చుంది.

కడుపులో ఏదో దిగులు కమ్ముకుంటుండగా.. వికలమయిన మనసుతో నేనూ లారీ ఎక్కాను.

లారీ కదిలింది.

ఈ ప్రపంచంతో నిమిత్తం లేనట్టు.. సంధ్యత్త తల పక్కకు వాల్చి ప్రశాంతంగా కళ్ళు మూసుకుంది.

ఆమె ముఖం చూస్తుంటే.. జీవితం పట్ల ఇంకా తరగని ఆశేదో.. ఆమె ముఖంలో అదృశ్యంగా వ్యక్తం అవుతున్నట్టుంది.

ఆ మిట్ట మధ్యాహ్నం.. ఎండ నిప్పులు చెరుగుతుండగా.. మా కొబ్బరికాయల లారీ చెమటలు కక్కుతూ.. మా ఊరి వైపు సాగిపోతా వుంది...



# ప్రాచీన కథ - ప్రస్థానం

(భారతీయ కథ - తెలుగు కథ)

## ఆరువేల సంవత్సరాల కథాయాత్ర

## జయంతి పాపారావు గారి చారిత్రక అధ్యయనంపై విశ్లేషణ

- డా. దామెర వేంకట సూర్యారావు

9885188431




శ్రవ్యదృశ్య కళల పరిధిలో సినిమా బలవత్తరమైన శక్తి అయితే, సాహిత్య పరిధిలో కథా ప్రక్రియ అంతటి విస్తృత ప్రభావం కలది. ఆధునిక కథానిక పారిశ్రామిక యుగపు ఆధ్యాత్మిక భౌతిక కల్లోలాలను ప్రతిబింబించే దర్పణం. మానవుడి ఊహలు రెక్కలు విప్పుకున్ననాడే కథ పుట్టింది. చీకటి వెలుగుల ప్రపంచంలో మానవుడి మనుగడే ఒక మహత్తర గాథ. కథలంటే మనిషి చెవి కోసుకుంటాడు. శ్రవణాసక్తి మనిషి స్వభావంలోనే వుంది. అన్ని దేశాలలోనూ మౌఖిక వాఙ్మయంలో కథలుంటాయి. అవి సహజంగా ఉంటాయి. భారతీయ సాహిత్యంలో ప్రాచీన కాలం నుంచీ గొప్ప కథా సాహిత్యం వుంది. అది మన సాంస్కృతిక సంపద. జాతి జీవనంలో అనేక రూపాలుగా అంతర్భాగమైన కథా ప్రక్రియ జానపదుల నుండి నాగరికుల వరకు, ఆదికాలం నుంచి అర్వాచీనకాలం వరకు కొనసాగుతూవుంది.

తెలుగు సాహిత్యంలో కథా సాహిత్యంపై ఇప్పటికే కొంత పరిశోధన జరిగింది. విభిన్న అంశాలపై గ్రంథాలు వెలువడ్డాయి. వివిధ కథకుల రచనల అనుశీలనం జరిగింది. ఐతే జయంతి పాపారావు ఈ బృహత్తర గ్రంథం, ప్రాచీన భారతీయ తెలుగు కథల చారిత్రక అధ్యయనం, ఈ దృక్కోణంలో వెలువడిన మొదటి విమర్శ గ్రంథం ఇదే కావచ్చు. జయంతి పాపారావు కథకులుగా, నవలా రచయితగా, విమర్శకుడిగా తెలుగు సాహిత్యానికి పరిచితులే. వారు ఎన్నో సంకలనాలకు సంపాదకత్వం వహించారు. వారి రచనలు ఇతర భాషలలోనికి అనువదింపబడ్డాయి. విశ్వ విద్యాలయాల్లో వారి రచనలపై సిద్ధాంత గ్రంథాలు వెలువడ్డాయి. పాపారావు ఈ గ్రంథాన్ని స్థూలంగా మూడు విభాగాలు చేశారు.

1. జానపద వాఙ్మయం - ప్రస్థానం.
2. ప్రాచీన భారతీయ కథ - ప్రస్థానం.
3. ప్రాచీన తెలుగు కథ - ప్రస్థానం.

మౌఖిక స్థితిలో నిలిచిపోయిన జానపద సాహిత్యం, మన సంస్కృతీ సంప్రదాయాలను ముందు తరాలకు అందించే జ్ఞానభాండారం. నన్నయకు ముందునుంచీ మనకు జానపద గేయాలు ఉన్నాయి. వాటిల్లో కథలూ వుంటాయి. కథాకథన సంప్రదాయం అన్ని సమాజాల్లోనూ వుంది. గానయోగ్యంగా రూపొందిన గేయ కథలు రాగ, తాళ, లయానుగుణంగా వుంటాయి. పాపారావు గారు జానపద వాఙ్మయం - ప్రస్థానం అనే మొదటి అధ్యాయంలో కథా గేయాల లక్షణాలను వివరించారు. వాటిని వర్గీకరించారు. జానపద కథల లక్షణాలను వివిధ పరిశోధకుల అభిప్రాయాలు ఆధారంగా పేర్కొన్నారు. తెలుగులో శాస్త్రీయ పద్ధతుల్లో ఇంతవరకు జానపద కథల సేకరణ జరగలేదని ఈ విషయంలో విశ్వవిద్యాలయాల వంటి సంస్థలు కృషి చేయకపోతే మిగిలి

ఉన్న కథలు కూడా నశించిపోతాయని అభిప్రాయం వ్యక్తం చేశారు. జానపద కథా బీజాలు ప్రాచీన భారతీయ కథల్లోనూ, ప్రాచీన భారతీయ కథాబీజాలు జానపద కథల్లోనూ ఉన్నాయని పరిశోధకులు గుర్తించినట్టుగా రచయిత వివరించారు.

ప్రాచీన భారతీయ కథ – స్వరూప స్వభావాలు అనే అధ్యాయం చాలా విస్తృతమైనది. ఇందులో ప్రాచీన కథ స్వరూప స్వభావాలను వివరించారు. కథా ప్రస్థానంలోకి అడుగుపెట్టడానికి శాస్త్ర విషయాల పట్ల అవగాహన కోసం సంస్కృతంలో వచ్చిన వివిధ అలంకార శాస్త్ర గ్రంథాలను పరిచయం చేశారు. ఈ భాగం వల్ల ఈ గ్రంథానికి కలిగే ప్రత్యేక ప్రయోజనం ఎంతో ఉంది. వివిధ అలంకారికులు కథ భేదాలను ఎలా వర్గీకరించారో రచయిత ప్రదర్శించారు. వేదాలు మానవ మేథా పరిణతకి ప్రకృష్టమైన ప్రమాణాలుగా భారతీయులు పరిగణిస్తారు. భారతీయ కథ ఋగ్వేదంలోనే ప్రారంభమైనదని తెలుస్తోంది. వేదాలు ఆవిర్భవించి ఆరువేల సంవత్సరాలైందని అంటే భారతీయ కథ లిఖిత రూపంలో ఆరువేల సంవత్సరాల ప్రాచీనతను కలిగినదని రచయిత అభిప్రాయం. ఋగ్వేదంలోని కథా వస్తువు పురాణం, ఇతిహాస వృత్తాంతాలకు మౌలిక ప్రాతిపాదిక ఏర్పరిచినట్లు భావించారు. ఋగ్వేదం, సామవేదంలోని కొన్ని సూక్తులు ఆధారంగా ఆనాటి సమాజ జీవన చిత్రణను వివరించారు. పురాణ ఇతిహాసాలలోని కథను వివరించే ప్రయత్నంలో భాగంగా రామాయణ, మహాభారతాల్లోని ఉపాఖ్యాన తత్వాన్ని వివరించారు. తెలుగులో గొప్ప భారతం వచ్చిందని గాని, గొప్ప రామాయణం రాలేదనే అభిప్రాయం సాహితీ జగత్తులో వినిపిస్తుందన్నారు. భారతంలోని కొన్ని నీతి కథల సారాంశాన్ని వివరించేరు. ప్రాచీన భారతీయ కథా ప్రస్థానంలో రామాయణ, భారత కథలు ఒక పరిణామ దశగా నిలుస్తాయని ఇతిహాసాలు నాటి సమాజాన్ని తెలియజేయడంతో పాటు, భావి సమాజానికి దిశా నిర్దేశం చేస్తాయని వివరించడం సముచితంగా వుంది. అంతేకాదు పశువులను, పక్షులను పాత్రలుగా చేసుకొని మానవ మనస్తత్వాన్ని విశ్లేషించే సృజనాత్మక రచనా విధానం ప్రపంచంలో భారతీయ కథలతోనే ప్రారంభమైందన్నారు. ప్రాచీన భారతీయ కథ బౌద్ధ, జైన సాహిత్యంలో ఎలా వికసించిందో లోతుగా పరిశీలించారు. బౌద్ధంలోని జాతక కథలు, అవదాన వాఙ్మయాన్ని సమీక్షించారు. కొన్ని కథలను వివరించి, అందులోని ధర్మోపదేశం ప్రజల జీవన ఉన్నతీ కరణ లక్ష్యంగా సాగిందన్నారు. కొన్ని జైన కథల సారాంశ రూపాన్ని అందిస్తూ వస్తు రూపాలు రెండింటిలోనూ ఈ కథల్లో వైవిధ్యం దర్శించవచ్చుని గమనించారు.

పంచతంత్రం ప్రాచీన భారతీయ కథా సాహిత్య చరిత్రను సృష్టించి ప్రపంచంలోని అన్ని ఖండాల్లోకి ప్రవేశించిందని, పంచతంత్ర కథలు 60 ప్రపంచ భాషల్లోకి అనువదించబడ్డాయని పేర్కొన్నారు. గుణాఢ్యుని బృహత్కథ, క్షేమేంద్రుని బృహత్కథామంజరి, సోమదేవ సూరి కథా సరిత్సాగరంలోని కథల స్వరూప స్వభావాలను వివరించారు. సంస్కృతంలో దండి రచించిన వచన కథా కావ్యం దశకుమార చరిత్ర ఆ కాలం నాటి సమాజాన్ని దర్శింపజేస్తుందని పేర్కొన్న రచయిత, వేతాళ పంచవింశతిలోని ధర్మాధర్మ వివేచనను విశ్లేషించారు. గాథా సప్తశతి ప్రసిద్ధమైన ప్రాకృత కథా సంకలనం. దీని కర్త హాలుడనే శాతవాహన రాజు అని ప్రసిద్ధి. అయితే ఇవి 300 మంది చెప్పిన కథలని రచయిత పేర్కొన్నారు.

పాపారావు గారు తెలుగు జానపద కథలను 12 విభాగాలుగా వర్గీకరించేరు. ఆంధ్రదేశంలో లెక్కలేనన్ని జానపద కథలున్నా సేకరించేవారు లేక చాలా కథలు అజ్ఞాతంగా మరుగునపడ్డాయని పేర్కొన్నారు. ఈ సందర్భంగా పల్నాటి వీర చిత్ర, కాటమరాజు కథ, బొబ్బిలి కథ మొ॥లైన వీర గాథలను ప్రస్తావించారు. తొలి తెలుగు కథాకావ్యం దశకుమార చరిత్ర. దీని కర్త కేతన. ఇందులోని అనువాద విధానాన్ని వివరించి రచయిత కొన్ని కథలను సంక్షిప్తంగా ప్రదర్శించారు. కొరివి గోపరాజు రచించిన సంహాసన ద్వాత్రింశిక కథలను విశ్లేషించారు. పంచతంత్ర కథలు నీతి ఉద్యమ వికాసంగా అభివర్ణించారు. విక్రమార్క చరిత్ర గురించి చెబుతూ మహాపురుషుల చరిత్రలు సమాజాన్ని ప్రభావితం చేస్తాయనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. శుక సప్తతి, హంస వింశతి కథల సారాంశాన్ని సంక్షిప్తంగా అందించారు.

చివరగా తెలుగులో వచ్చిన సి.పి. బ్రౌన్ సేకరించిన తాతాచార్యుల కథలు, కాశీ మజిలీ కథలను సమీక్షించారు. జయంతి పాపారావు ఈ గ్రంథాన్ని ప్రణాళికా బద్ధంగా రచించారు. నిర్దిష్టమైన పరిశోధన విధానాల ప్రాతిపదికన ఈ సిద్ధాంత గ్రంథం రూపొందించారు. ప్రతి అధ్యాయం చివర దాని సారాంశం వివరించారు. విశ్వ విద్యాలయాలు, సాహిత్య పీఠాలు చేయాల్సిన బృహత్ కార్యాన్ని తలకెత్తుకొని ఒంటిచేతి మీద నిర్వహించిన రచయిత అభినందనీయులు. కథా సాహిత్య పరిశోధకులకు ఈ గ్రంథం గొప్ప వెలుగును చూపగలదు. ప్రతిభాయుతమైన ఈ రచన తెలుగు కథా సాహిత్యానికి సైద్ధాంతిక దిశా నిర్దేశం చేయగలిగిన స్థాయిలో ఉందని చెప్పడం అతిశయోక్తి కాదు, ఇది కథల విజ్ఞాన ఖజానా. జయంతి వారి కథోపనిషత్.



# స్వీకారం

## స్ఫూర్తి



పాటలు

- ప్రజానాట్యమండలి

వెల : రూ.200/- పేజీలు : 368

ప్రతులకు : 9490098694

తన పాటను సూటిగా శ్రోత లేదా పాఠకులకి అందించగల నేర్పు స్ఫూర్తికి ఉంది. ఈ సంపుటి మొత్తం చదివాకా నా కళ్ళముందు ఒక 'ఎర్రనారుమడి' కనిపించింది. అంతేకాదు ఈ పాటలన్నీ ఏదో ఒక మహాసభకు తరలివెళుతున్న కార్యకర్తల్లాగా కనిపించాయి. ఎవరికి వారు సభా ప్రాంగణానికి త్వరగా చేరుకునేందుకు ప్రయత్నించి గబగబా ముందుకు సాగుతున్నట్లు సాగిపోయాయి.

- సీతారాం

## కవి సంగమం



2012 కవిత్వం

- సంపాదకవర్గం

వెల : రూ.150/- పేజీలు : 330

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్

తాను తప్పుకుంటూ కాయకు చోటిచ్చే పూవులా, యాకూబ్ ఇన్ని ఫలాలను విరగ కాయించాడు. ఎవరి ఈల వారిది, ఎవరి పాట వారిది. అన్నీ విభిన్న ఫలాలే. ఎవరి ప్రత్యేకత వారిది. కాపు కాయటమే కవితోద్యమం అయిపోయింది. 'కవిసంగమం' అయింది.

- సతీష్ చందర్

## తప్పటడుగు




- గంటి భానుమతి

వెల : రూ. 100/- పేజీలు : 152

ప్రతులకు : 27151439

'తప్పటడుగు' నవల చాలా మంచి కథావస్తువు. ఇది చదువుతుంటే అవి పాత్రలుగా అనిపించవు. పక్కింట్లో, లేదా మనింట్లోనే జరుగుతున్న సంఘటనలు అన్పిస్తాయి. ఎందుకంటే ఇలాంటి పిల్లలు ఈనాడు ప్రతి ఇంట కన్పిస్తారు. పెడతోవపడుతున్న యువతరం.. అలాంటి పిల్లలని ఎలా దారికి తెచ్చుకోవాలో అర్థంకాని తల్లిదండ్రులు పడే వ్యధ, బాధ ఈ నవలలో కథా వస్తువు.

- డి. కామేశ్వరి

## గోర్కి కథలు




తెలుగు అనువాదకులు : కె. కేశవరెడ్డి

వెల : రూ.30/- పేజీలు : 80

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్

గోర్కీ విద్యావంతుడు కాదు. కానీ గొప్ప గొప్ప కథలు రాసాడు. అవి గొప్ప కథలు అయ్యాయంటే శిల్ప, నిర్మాణ, భాషా శైలి, సౌందర్య, రసానుభూతుల కారణంగా గొప్పవి కాలేదు. ఆనాడు తాను బతికిన సమాజం ఎంత దుర్భరమైనదో కళ్ళకు కట్టినట్టు చెప్పాడు. అంతకన్న ఉన్నత మానవీయ సమాజాన్ని వాగ్దానం చేశాడు. అందుకే ప్రజలు ఈ కథలను గుండెలకు హత్తుకున్నారు.

- సాహితీ స్రవంతి

## అక్కిరాజు కథలు




తమ్మినేని అక్కిరాజు

వెల : రూ.50/- పేజీలు : 95

ప్రతులకు : 9440167891

ప్రత్యక్ష, పరోక్ష అనుభవాలను 'స్కెచ్'ల రూపంలో నమోదుచేయటం అక్కిరాజు శిల్పకళా వైవిధ్యం. ప్రతి కథానికా పాఠకుడిగా తీవ్రంగా ఆలోచింపజేస్తుంది. విభిన్నణాలతో సామాజిక వాస్తవాలను అక్షరబద్ధం చేసిన అక్కిరాజు 'కథలు' పాఠకుల్ని పట్టి కుదుపుతాయి. మీ సంగతేమిటి? అని నిలేస్తాయి.

- జన సాహితి

## నోబెల్ కవిత్వం




కవుల జీవిత - కవిత్వ విశేషాలు

- ముకుంద రామారావు

వెల : రూ.170/- పేజీలు : 300

ప్రతులకు : ప్రముఖ పుస్తకాల షాపుల్లో

ఈ పుస్తకం ద్వారా నోబెల్ బహుమానం పొందిన ప్రపంచ కవుల కవిత్వం సమర్థంగా అనువాదమై, వాళ్ళ జీవిత చరిత్రలతో సహా మన ఎదురుగుండా వొచ్చింది. ఇందువల్ల మనకి రెండు లాభాలు కలుగుతాయని అనుకుంటున్నాను. ఒకటి - మన దృష్టి ప్రపంచమంత విశాలంగా తయారవడం, రెండు - మన భాషలో రాస్తున్న వాళ్ళలో మంచి కవులని ప్రచార నిరపేక్షంగా గుర్తించగల బుద్ధి నైశిత్యం మనకి ఏర్పడడం.

- వెల్చేరు నారాయణరావు

## విసురు

– రెక్కల సంపుటి

వెల : రూ. 40/- పేజీలు : 56

ప్రతులకు : 9393804472



తంగిరాల చక్రవర్తి రెక్కల్లో 'విసురు' అనే లక్షణం బాగా కనిపిస్తుంది. దానిక్కారణం, తన రాజకీయ విమర్శంతా ఖండితంగా, చెప్పినట్టుంటుంది. తన అభిప్రాయాల్ని నిర్భీతిగా, వేగవంతమైన శైలితో, శక్తిగల పదాలతో చెప్పడం వల్ల ఈ 'విసురు' అనే లక్షణం సిద్ధిస్తుంది.

**డా॥ - అద్దేపల్లి రామమోహనరావు**

## అక్కిరాజు కథలు

– తమ్మినేని అక్కిరాజు

రూ. 50/- పేజీలు : 98

ప్రతులకు : మైత్రీ బుక్స్



బానిస మనస్తత్వాల మధ్యతరగతి వర్గాలపై జాలితో కూడిన విమర్శ అక్కిరాజు రచనల్లో కనిపిస్తుంది. ప్రజల కోసం తమ జీవితాలను తృణప్రాయంగా ఎంచి త్యాగాలకు సిద్ధపడిన, త్యాగం చేసిన వారి పట్ల ఎంతో ప్రేమ – అభిమానం కురిపిస్తుంది.

**- జన సాహితి**

## ఇరుసు

కవితా సంకలనం

– కొండి మల్లారెడ్డి

పర్కపెల్లి యాదగిరి

వెల : రూ.50/- పేజీలు : 97

ప్రతులకు : యువసాహితి సమితి



ఈ కవితలు వ్రాసే ప్రయత్నంలో కవిమిత్రుల మందరం ఏ వర్గాన్ని కించపరచకుండా చేతివృత్తుల ఆత్మగౌరవాన్ని పెంచే విధంగా వ్రాయాలనుకున్నాము. ఇంతకుముందే కొందరు కవులు కొన్ని వృత్తులను కవిత్వీకరించారు. అవికూడా మాకు ఎంతో ఉపకరించాయి.

**- సంపాదకులు**

## అంతర్వేదన

కవిత్వం

– మెరాజ్ ఫాతిమా

వెల : రూ.60/- పేజీలు : 112

ప్రతులకు : 9000173860



ఫాతిమా కవితలు చాలామటుకు వ్యక్తిగత జీవితాగ్ని శకలాలుగా కనిపించినా అవన్నీ సామాజికమై చదువుతున్న మనల్ని ఎంతో వేదనకు గురిచేస్తాయి. రొమాంటిక్ పొయెమ్స్‌గా భ్రమింపజేస్తున్న ఈ కవితలన్నీ, జీవిత సహచరుల ప్రేమానురాగాలు కోల్పోయి జీవచ్ఛవాలై కళ్లల్లో వొత్తులేసుకొని ఆర్తితో దైన్యంగా వాళ్ల నుండి కాసింత తడిచూపు కోసం స్త్రీతనం చేసిన పలవరింతలుగా స్ఫురిస్తాయి.

**- డా॥ శాంతి నారాయణ**

## ఈ మట్టి మనదే

కవిత్వం

– ఎస్.ఆర్. పృథ్వి

వెల : రూ. 75/- పేజీలు : 112

ప్రతులకు : 9989223245



కవిత్వంలో ఎన్నో వస్తువులు వచ్చేసినై. ఐతే కవి చెప్పే ధోరణి, కొత్త భావాలు భావాంశాలు, భావాల్లోని కొత్త కోణాలూ మొదలైనవన్నీ కవిత్వాన్ని నవనవం చేస్తై. అయితే వస్తువు కొత్తది కావడం కూడా ఒక కొత్త ద్వారాన్ని తెరుస్తుంది. ఇలాంటి కొన్ని వస్తువుల్ని పృథ్వి ఈ కవితా సంపుటిలో గ్రహించాడు.

**- అద్దేపల్లి రామమోహనరావు**

## అంతర

– రామా చంద్రమౌళి

వెల : రూ.150/- పేజీలు : 140

ప్రతులకు : రామచంద్రమౌళి



ఐతే.. ఏ కవైనా ఈ అగాధ అద్యంత రహిత శూన్యంలో ఒక అసంపూర్ణత నుండి సంపూర్ణతవైపు నిర్విరామ నిరంతర పయనం జరుపవల్సిందే.. ఆ అంతులేని యానంలో యింకో నా మజిలీ ఈ 'అంతర'.

**- రామాచంద్రమౌళి**

## జన జీవన రాగంలో...



గేయరూప కవిత్వం

- కన్నెగంటి వెంకటయ్య

వెల : రూ. 30/- పేజీలు : 37

ప్రతులకు : 9885657582

ప్రతీ పాటలో నిజాయితీ తొణికిసలాడుతుంది. కవితోపాటు గాయకుడు కూడా కావటం వలన వెంకట్‌ను వాగ్గేయకారునిగా చేసింది. తాను రాసిన పాటకు తానే బాణి కట్టుకొని పాడి ప్రజల్ని రంజింప చేయడం చిన్న విషయం కాదు. అనితర సాధ్యమైన సాధనతో దానిని సాధించాడు వెంకట్.

- దేవేంద్ర

## మహోజ్వలనం




- అభిలాష

వెల : రూ. 225/- పేజీలు : 368

ప్రతులకు : 9666222737

నాలోకం నాది.. నిప్పులతో ఆటాడు.. విజయాన్ని ముద్దాడు.. తెలుసుకో నేస్తం.. గ్రహించు వాస్తవం.. ఇలా చాలా కవితలలో ఎన్నో సామాజిక సత్యాలను కుమ్మరించింది. అభిలాషకు రాసే ప్రతి అక్షరంలో రగిలే నిజాలనే వెళ్ళగక్కాలని ఆశ.... మనసులో మరిగి మరిగి మండుతున్న మనోభావాలని మాగొప్పగా బట్టబయలు చేసి చూపాలని ఆశ... మార్పు తేవాలని ఆశ.. మార్చి పారేయాలని ఆశ... మరో వేమనలా అభిలాష ఎదగాలని నా ఆశ.

- నూర్ భాషా రహంతుల్లా

## సంపెంగలు




కథల సంపుటి

- కందుకూరి వెంకట మహాలక్ష్మి

వెల : రూ.100/- పేజీలు : 173

ప్రతులకు : 9868237137

ఆమె మహానగరాల్లో జీవించడమేకాదు, పరిమిత మధ్యతరగతి సంసారాల్లో తరుచు ఎదురయ్యే మానవ సంబంధ సమస్యల్ని చూసి ఊరుకోకుండా వాటిగురించి గట్టిగా తమ కథల్లో మాట్లాడే స్వభావం కలవారు. ఉద్యోగాలు చేశారు. సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ముఖ్యంగా మధ్యతరగతి జీవితాల ఆటుపోట్లని, తమ స్త్రీ మనస్సుతో అర్థం చేసుకుని, వ్యాఖ్యానించారు.

- ఇంద్రగంటి శ్రీకాంత్‌శర్మ

## వసంతం మళ్ళీ వస్తుంది




కవితలు

- డా॥ జె. భాగ్యలక్ష్మి

వెల : 60/- పేజీలు : 86

ప్రతులకు : అన్ని ప్రముఖ షాపులు

భాగ్యలక్ష్మి తమ జీవితంలోని అనుభవాలను, యాత్రా స్మృతులను తమ రచనల్లో శకలాలు శకలాలుగా పాఠకుల కళ్ళ ముందు దృశ్యమానం చేస్తారు. 'వసంతం మళ్లీ వస్తుంది' కవితాసంపుటి కవయిత్రి తాత్త్విక చింతనకు అద్దం పడుతుంది.

- సూర్య ప్రచురణలు

## ఊరి దారి




- గ్రామ అధ్యయన పరిచయం

ఎన్. వేణుగోపాల్

వెల : రూ. 60/- పేజీలు : 164

ప్రతులకు : 040-66843495

ఇటీవలి కాలంలో, ముఖ్యంగా ప్రపంచీకరణ తరువాత చాలా మార్పులు జరిగిపోయాయని, గ్రామాలలో ఉత్పత్తి సంబంధాలు మారిపోతున్నాయని ఒక అభిప్రాయం బలపడుతోంది. ఈ నేపథ్యంలో గ్రామీణ అధ్యయనాలకు మళ్లీ ఒకసారి ప్రాధాన్యత పెరుగుతోంది. గ్రామాలు గ్రామాలలో ఉత్పత్తి సంబంధాలు ముప్పై ఏళ్ల కింద ఉన్నట్లే యథాతథంగా ఇవాళ కూడా ఉన్నాయని వాదించడం అర్థరహితమే అవుతుంది.

- - ప్రచురణకర్త

## అవతలి వైపు




- శ్రీపాద స్వాతి

వెల : రూ.100/- పేజీలు : 188

ప్రతులకు : 040-65811258

ఎన్నేళ్లనుండో ఎదురుచూస్తున్న స్వల్ప ఆనంద డోలిక, చివరి క్షణంలో పుటుక్కున తెగిపోయినా "యజ్ఞఫలం" దక్కటంలోనే పరమార్థం వుందని చెప్పటం. మధ్యతరగతి మనుషులకే చెల్లు. ఈ నేపథ్యంతో ఆమె కథలన్నీ పరిశీలించండి.

- మునిపల్లి రాజు

# సామాజిక దర్పణం ఛాయరాజ్ సాహిత్యం



- బెందాళం కృష్ణారావు
9493043888

ప్రజాసాహిత్య సాంస్కృతి కోద్యమ బాటలో నేను సైతం అంటూ ముందుకు సాగిన అక్షర యోధుడు ఛాయరాజ్. మహాకవి గురజాడ 151వ జయంతికి ఒక్కరోజు ముందు – సెప్టెంబర్ 20వ తేదీన ఆయన తుదిశ్వాస విడిచారు. వృత్తి రీత్యా ఉపాధ్యాయుడు అయిన ఆయన ప్రవృత్తి రీత్యా కవి, రచయిత. అన్నిటినీ మేళవించిన సామాజిక దార్శనికుడు. కళింగాంధ్ర సాహితీ వికాసంలోనే కాక తెలుగు సాహిత్య ప్రపంచంలోనే ఛాయరాజ్‌ది విభిన్నమైన ముద్ర. ఎవరినీ అనుకరించకుండా, అనుసరించకుండా తనదైన సొంత గొంతుకతో సాహితీలోకంలో బలమైన స్వరాన్ని వినిపించారు. అందుకే ఎంతోమంది త్యాగాలతో పోరాట చైతన్య కేంద్రంగా నిలచిన శ్రీకాకుళం.. ఛాయరాజ్ ఇంటిపేరైంది.

సంఘం శరణం గచ్ఛామి అంటూ సామాజిక మానవతా విలువలను విశ్వమానవాళికి ప్రబోధించిన బౌద్ధం అవశేషాలు మిగిలిన శాలిహుండాం పక్కనున్న గార మండలంలోని కొంక్యానపేట ఛాయరాజ్ స్వగ్రామం. 1948 జులై 6వ తేదీన సూరమ్మ సత్యనారాయణ దంపతులకు జన్మించారు. బియస్సీ, బిఇడి చదివారు. సామాజిక శాస్త్రంలో ఎంఎ పట్టా పొందారు. చిన్నప్పటి నుంచే చుట్టూ ఉన్న సమాజం నుంచి స్ఫూర్తి పొందిన ఛాయారాజ్ ఏనాడూ నేల విడిచి సాము చేయలేదని ఆయన రచనలను పరిశీలిస్తే స్పష్టం అవుతుంది. ప్రజల భాషలో ప్రజల కోసం, ప్రజలతో మమేకం అయ్యే ఎన్నో రచనలను వెలువరించారు. ఉపాధ్యాయ వృత్తిలో ఆయన పాఠాలు చెప్పి జీతం తీసుకోవడానికే పరిమితం కాలేదు. విద్యారంగ సమస్యలపై, ఉపాధ్యాయ రంగ సమస్యలపై శాస్త్రీయ విశ్లేషణలను కూడా చేశారు. 1970 నుంచి 1992 వరకూ వరకూ ఉపాధ్యాయ ఉద్యమ కార్యకర్తగా సేవలందించారు. 1980లో జనసాహితి సంస్థలో సభ్యునిగా చేరి రాష్ట్ర కార్యవర్గ సభ్యునిగా, ఆ తరువాత 2007 నుంచి తుదిశ్వాస విడిచేవరకూ జనసాహితి రాష్ట్ర అధ్యక్షునిగా తన సాహితీ ప్రస్థానం కొనసాగించారు.

'శ్రీకాకుళం ఛాయరాజ్‌గా' తొలి కావ్యంతోనే గుర్తింపు పొందిన ఆయన 1968కి ముందు, ఆ తరువాత ఉమ్మడి శ్రీకాకుళం జిల్లాలో సాగిన గిరిజన రైతాంగ ఉద్యమం, సమరశీల పోరాటం, అతివాద చర్యల ఫలితంగా ఏర్పడిన విషాదాన్ని కథా వస్తువుగా తీసుకుని 'శ్రీకాకుళం' పేరుతో ఉద్యమ కథాకావ్యాన్ని 1989లోనే అందించారు. కొండ ప్రాంతంలో ఉండిన గుండె చెమ్మతో ఇంద్రజాల వాస్తవికతను జోడించి, కళింగ వంశధారలో సూర్యబింబంగా ప్రతిబింబించేలా గుమ్మ కావ్యాన్ని 1995లో రాశారు. స్త్రీ, పురుష సంబంధాలను విప్లవీకరించి అందమైన పదచిత్రాలతో 'నిరీక్షణ' కావ్యాన్ని 1996లో అందించారు. స్త్రీ, పురుష రూపాలను, వ్యత్యాసాలను రూపుమాపి నూతన మనిషిని సృజించాలని వసుంధరను వేడుకున్న ఛాయరాజ్ – జీవశాస్త్రవేత్తల పరిశోధనలకు ఊతమిచ్చే దార్శనికతను ఆవిష్కరిస్తూ 'దర్శిని' కావ్యాన్ని 1999లో రాశారు. ఈ కావ్యం ఆంగ్లంలోకి అనువాదం అయింది. అనాథలంతా, అభాగ్యులంతా, అశాంతులంతా, అనేకులింకా, దీర్ఘశృతిలో, తీవ్రధ్వనితో విప్లవ శంఖం వినిపిస్తారని మహాకవి శ్రీశ్రీ ఆనాడు స్వప్నిస్తే ఆ అనాథ బాలుడిని 'బుధడు'గా విప్లవ భావుకతతో 2003లో కావ్యంగా మలిచారు. అమ్మను 'తొలెరుక'గా, రైతుల కష్టాలను, కన్నీళ్ళను 'దుఖ్ఖేరు'గా కవితా సంకలనాన్ని 'రసస్పర్శ'గా 2005లో తీసుకొచ్చారు. అంతకుముందే 1999లో 'మట్టి నన్ను మౌనంగా ఉండనీదు' అనే కవితా సంపుటిని రాశారు. 2010లో అమరకోశం కవితలు, అనుపమాన కథారూపకాలు రాశారు. 2012లో సాహిత్యోద్యమ పతాక మన గురజాడ వ్యాసాలు, నేను సైతం పేరుతో శ్రీశ్రీపై వ్యాసాలను సంకలనంగా తీసుకొచ్చారు. కవిత, కథ, పాట, నృత్యగీతం, సాంఘిక, సైద్ధాంతిక, సాహిత్య వ్యాసాలు, సెల్‌ఫోన్ కథల పరిచయం, తెలుగు సాహితీ ప్రముఖుల వ్యాస పరంపర ఒక ఎత్తయితే ఆయన రాసిన 'మాతృభాష' కవిత మరొక ఎత్తు. శ్రమ అనే అమ్మ కన్న తెలుగు భాషా చారిత్రక, సాంస్కృతిక చలన చైతన్య పుంజం ఆ కవిత. అందులో 'పుట్టుక దగ్గర, చావు దగ్గర పరభాషలో నవ్వలేను, ఏడ్వలేను' అన్న వ్యక్తీకరణ ఛాయరాజ్ కలం నుంచి జనించినదే! ఛాయరాజ్‌ది అవార్డులకే ఒదిగిపోయే చైతన్యం కాదు. కానీ, ఆయన్ని వెతుక్కొంటూ ఎన్నో అవార్డులు వచ్చాయి. వాటిలో ఫ్రీవర్స్ ఫ్రంట్, తెలుగు వికాసం అవార్డులు, లాంగుల్య మిత్రుల పురస్కారం, డాక్టర్ ఆవంత్స సోమసుందర్ సత్కారం, సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ కృష్ణశాస్త్రి కావ్య పురస్కారం, ఆంధ్రప్రదేశ్ సాహితీ సాంస్కృతిక సమాఖ్య సత్కారం, సత్యమూర్తి ట్రస్ట్ శ్రీశ్రీ పురస్కారం, యగళ్ల ఫౌండేషన్ సత్కారం వంటివి ఉన్నాయి. ఛాయరాజ్ రచనలపై ఎంతోమంది విద్యార్థులు ఎంఫిల్, పిహెచ్‌డి పరిశోధనలు చేస్తున్నారు. వ్యక్తి చైతన్యాన్ని సామాజిక చైతన్యంగా పదునుపెట్టే కవి ఛాయరాజ్. ఇతిహాసపు చీకటి కోణంలో దాగి ఉన్న నిజాలను ఆయన నేటితరానికి అందించారు. అందులో భాగంగానే కటక్ నుంచి పిఠాపురం వరకూ విస్తరించి ఉన్న కళింగ ప్రజల చారిత్రక విశిష్టతను వైవిధ్యభరితమైన కళింగ జీవనసారాన్ని 2300 ఏళ్ల క్రితపు కళింగయుద్ధం నేపథ్యంగా 'కారువాకి' అనే నవల రాశారు. ఇంతరవకూ ఎవరూ స్పృశించని కథా వస్తువును నవలను తీర్చిదిద్దారు. తన రచనలతో అనంత చైతన్యాన్ని ఆవిష్కరించిన ఛాయరాజ్ జీవితాంతం ప్రజాపక్షవాదిగా ఉన్నారు. జనం తరపున నిలబడి, సమాజ అభ్యుదయానికి పాటుపడడమే ఆయనకు సాహితీ మిత్రులు అందించే నిజమైన నివాళి.

## సరళీకరణ విధానాల ఫలితమే ధరల పెరుగుదల




'అధిక ధరలు' అంశంపై జనకవనంలో ప్రసంగిస్తున్న 10టివి మేనేజింగ్ డైరెక్టర్ వేణుగోపాల్ రావు. చిత్రంలో సాహితీస్రవంతి నగర కమిటీ ప్రతినిధులు శాంతిశ్రీ, కిషోర్, జి. యాదగిరి రావు ఉన్నారు.

ప్రభుత్వం అమలు చేస్తున్న సరళీకరణ విధానాల ఫలితమే నేడు ప్రజలపై ధరల భారాలు రోజురోజుకూ పడుతున్నాయని టెన్ టివి ఎమ్‌డి వేణుగోపాల్ విమర్శించారు. సెప్టెంబరు 11న సుందరయ్య విజ్ఞానకేంద్రంలో సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జనకవనం నిర్వహించారు. అనంతరం అధిక ధరలు అనే అంశంపై సదస్సులో ఆయన మాట్లాడారు. ధరల పెరుగుదలపై ప్రభుత్వ నియంత్రణ లేదని, లాభాల కోసం వెంపర్లాటలో వినియోగదారులపై విపరీతమైన భారాలు పడుతున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రణాళిక సంఘం గ్రామీణ ప్రాంతంలో రూ. 27, పట్టణ ప్రాంతంలో రూ. 30 ఖర్చు పెట్టగలిగితే దారిద్ర్య రేఖకు దిగువన ఉన్నట్లు కాదని చెప్పడం ఘోరమైన విషయమన్నారు. వాస్తవ పరిస్థితులను పరిశీలిస్తే ఓపెన్ మార్కెట్‌లో ముతక బియ్యం 30-35 రూపాయలు పలుకుతోందన్నారు. రేటు నిర్ధారించడంలోనే ప్రభుత్వం విఫలమైందన్నారు. పెట్రోలియం ఉత్పత్తుల విషయంలో అంతర్జాతీయంగా ధరలు పెరగాయని చెప్పి ఇక్కడ కూడా పెంచుతున్నారని, అక్కడ తగ్గినప్పుడు తిరిగి ధరలు దించడంలో శ్రద్ధ చూపడంలేదని చెప్పారు. ప్రభుత్వం అనుసరిస్తున్న తీరు మూలంగా 1991 నాటి సంక్షోభం కంటే మించి సంక్షోభాన్ని రాబోయే రోజుల్లో ఉంటుందనడంలో సందేహం లేదని ఆందోళన వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమానికి కిషోర్ అధ్యక్షత వహించారు. జనకవనం కార్యక్రమ నిర్వాహకురాలుగా శాంతిశ్రీ వ్యవహరించగా రాష్ట్ర కార్యదర్శి వొర ప్రసాద్, జి. యాదగిరిరావు, సాహిత్య ప్రకాశ్, పొత్తూరి సుబ్బారావు, రాజ్యలక్ష్మి, మోపిదేవి రాధాకృష్ణ, వెంకటి, కృష్ణమోహన్, నరహరి, నరేష్ మౌనశ్రీ మల్లిక్, కె. రాధాకృష్ణ, గజవెల్లి దశరథరామయ్య, పి.ఎన్. మూర్తి, పెద్దూరి వెంకటదాసు, సూతారపు వెంకట్, వి.ఎస్.వి. ప్రసాద్, మహేష్ దుర్గే, తదితరులు పాల్గొన్నారు. తంగిరాల చక్రవర్తి వందన సమర్పణ చేశారు.

## వల్లభాపురం జనార్ధన కు నోముల కథా పురస్కారం



ప్రముఖ కవి, రచయిత వల్లభాపురం జనార్ధన్ నోముల కథా పురస్కారం అందుకున్నారు. సెప్టెంబర్ 14న నల్లగొండ జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో నోముల సత్యనారాయణ అధ్యక్షతన నోముల సాహిత్య సమితి ఆధ్వర్యంలో నోముల కథా పురస్కార ప్రధానోత్సవం జరిగింది. వల్లభాపురం జనార్ధన రాసిన "బహుమతి" కథకు రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయ కమీషనర్ ఎన్. ముక్తేశ్వర రావు చేతుల మీదుగా కథా పురస్కారం అందుకున్నారు. కథల ఎంపికకు న్యాయ నిర్ణేతగా వ్యవహరించిన కేతు విశ్వనాథ రెడ్డి మాట్లాడుతూ 'బహుమతి' కథా వాస్తవికత చిత్రణతో పాత్రోచితభాషతో ఉన్నదని ప్రశంసించారు.

## తొలితరం నవీన కథకుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి



సెప్టెంబరు 1న కాకినాడ, గాంధీ భవన్‌లో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో సాహితీ సభ జరిగింది. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి 'అనుభవాలు - జ్ఞాపకాలు', వడ్లగింజలు, గులాబీ అత్తరు మొదలైన కథల నేపథ్యంలో ఆయన జీవితానుభవాల్ని గురించి డా॥ సీతారామస్వామి వివరించారు. సభకు అధ్యక్షత వహించిన డా॥ అద్దేపల్లి రామమోహనరావు మాట్లాడుతూ, ఆధునిక సమాజ నిర్మాణానికి అవసరమైన ప్రగతిశీల భావాల్ని అందించిన తొలి తరం కథకుల్లో శ్రీపాద ప్రత్యేకంగా చెప్పుకోవలసినవారన్నారు. 'పుల్లంరాజు' కథలో, బలవంతాన తెచ్చే సంస్కరణలు ఎంత ప్రజా విధ్వంసకరమో ఆనాడే చెప్పారనీ ఈనాటి సెజ్‌లు, కారిడార్లు, బలవంతంగా తేవడంవల్ల ప్రజలు ఎంత నష్టపోతున్నారో వివరించి, 'పుల్లంరాజు' కథని అర్థం చేసుకుంటే, ఈనాటి ప్రజావ్యతిరేక సంస్కరణల్లోని అవివేకం అవగాహన ఔతుందని చెప్పారు. సభా ప్రారంభంలో, శ్రీకృష్ణ దేవరాయ వెంకట్రావు వేణుగానం సభ్యుల్ని ముగ్ధులుగా చేసింది. ఆయనకి చక్రవర్తి తబలా సహకారం చేశారు. అనంతరం 'గోదావరి' శీర్షికపై 20 మంది కవులు చదివిన కవితలు ప్రజల్ని అలరించాయి. నెలనెలా గోష్ఠులకు కూడా 80 మంది పైగా రావడం అందర్నీ ఆనందపరచింది. గ.నా.రా స్వాగతం పలికారు. ఇబ్రహీం వందన సమర్పణ చేశారు.




గుంటూరులోని ఆరండల్‌పేటలో సెప్టెంబర్ 14న జరిగిన 'కువకువలు' రెక్కలు పుస్తకావిష్కరణ సభ. చిత్రంలో మంచికలపూడి సాంబశివరావు, అద్దేపల్లి రామమోహనరావు, వి.ఎం. పార్థసారధి, వి. సుధాకర్, వై.వి. రమణారావు, తల్లపురెడ్డి శ్రీనివాసరెడ్డి, జి. సుబ్బారావు, ఎస్.ఎమ్.సుభాని, సరస్వతి నారాయణయ్య ఎన్.వి. నరశింహం, దాసరి జై కృష్ణ ఉన్నారు.



సెప్టెంబరు 9న చీరాల సహజ సాహితీ సాహిత్య సాంస్కృతిక సంస్థ సాహితీ వసంతం పురస్కార ప్రధానోత్సవ సభలో కవి. వైహెచ్‌కె. మోహన్‌రావు 2012 సాహితీ పురస్కారం అందుకుంటున్న దృశ్యం. సభలో వడలి రాధాకృష్ణ, కట్టా రాజ్‌వినయ్‌కుమార్ తదితరులు.

## సాహిత్య అకాడెమీ యువ పురస్కారం - 2014

సాహిత్య అకాడెమీ గుర్తించిన 24 భారతీయ భాషల నుండి యువ పురస్కార్ 2014 గాను రచయితలు మరియు పుస్తక ప్రకాశకుల నుండి పుస్తకాలను ఆహ్వానిస్తున్నారు. రచయితల వయో పరిమితి జనవరి 1,2014 నాటికి 35 సంవత్సరాలు నిండి వుండకూడదు. ఈ బహుమతికి గాను రూ. 50,000 నగదు ఇవ్వడము జరుగుతుంది. పుస్తకముతో పాటు జన్మధృవీకరణ పత్రం ఖచ్చితంగా జతపరచి ఆఖరి తేది అనగా అక్టోబర్ 15, 2013 లోపన ఆఫీసర్ ఇన్‌చార్జ్, సాహిత్య అకాడెమీ, సెంట్రల్ కాలేజి క్యాంపస్, డా॥ బి.ఆర్. అంబేద్కర్ వీధి, బెంగళూరు - 560 001 విలాసమునకు పంపాలి. ఇతర వివరములకు గాను **www.sahitya-akademi.gov.in** సంప్రదించగలరు.



డా. ఆలూరి. విజయలక్ష్మి సామితీ స్వర్ణోత్సవం సెప్టెంబర్ 11వ తేదీన హైదరాబాద్ లోని త్యాగరాయగానసభ, కళాసుబ్బారావు కళావేదికలో విశ్వసాహితి, లేఖిని, త్యాగరాయగానసభ శ్రీవేదగిరి కమ్యూనికేషన్స్ ఆధ్వర్యంలో జరిగింది. వేదగిరి రాంబాబు సంచాలకులుగా వ్యవహరించిన ఈ సభకు పోతుకూచి సాంబశిరావు అధ్యక్షత వహించారు. పోరంకి దక్షిణామూర్తి ముఖ్య అతిథిగా కళా వేంకటదీక్షితులు, విరించి, వాసాప్రభావతి, చంద్రశేఖర ఆజాద్, రాజారామ్మోహనరావు, శ్రీమతి పొత్తూరి విజయలక్ష్మి అద్దేపల్లి నరసింహారావు, కె.వి. ప్రసాదవర్మా వక్తలుగా పాల్గొన్నారు. సభకు హాజరైన లోక్‌సత్తా పార్టీ జాతీయ అధ్యక్షులు డా. జయప్రకాష్ నారాయణ్ సంస్థల తరుపున డా. ఆలూరి దంపతులను సత్కరించారు.

## మంత్రి కృష్ణమోహన్‌కు పురస్కారం



కేంద్ర సాహిత్య అకాడమీ యువ పురస్కారం మంత్రి కృష్ణమోహన్‌కు 'ప్రవహించే పాదాలు మరియు ఇతర కవితలు' కవితా సంపుటికి 2013 సంవత్సరానికి కేంద్ర సాహిత్య అకాడమీ యువ పురస్కారం లభించింది. ప్రకాశం జిల్లా మార్కాపురానికి చెందిన మంత్రి కృష్ణమోహన్ గతంలో 'మట్టి పలకలు' కవితా సంపుటి వెలువరించారు. కేంద్ర సాహిత్య అకాడమీ మొత్తం 23 భాషలకు చెందిన యువ రచయితలకు పురస్కారాలు ప్రకటించింది. కవిత్వం, కథ, విమర్శ ప్రక్రియలను పరిశీలనకు తీసుకున్నట్లు కేంద్ర సాహిత్య అకాడమీ ఒక ప్రకటనలో తెలిపింది. ఈ పురస్కారాన్ని త్వరలో ఒక ప్రత్యేక కార్యక్రమంలో అందజేయనున్నట్లు అకాడమీ ప్రతినిధి కె. శ్రీనివాసరావు ఓ ప్రకటనలో తెలిపారు. యాభై వేల రూపాయల నగదును పురస్కారంగా మంత్రి కృష్ణమోహన్‌కు అందజేస్తారు.



ఇటీవల ఎల్.ఐ.సి ఉద్యోగులు లలిత కళాసమితి హైదరాబాద్, హాస్యావధాని జి.ఎల్.నరసింహం గారిచే "నవ్వుకుందాం రండి" హాస్యావధాన రూపకం నిర్వహింపబడినది. చిత్రంలో కళ్యాణి, శ్రీదేవి, జె.ఎస్.ఆర్.మూర్తి, ఎన్. నాగరాజు, కె.ఎల్. కామేశ్వరరావు, జె.ఎల్. నరసింహం, మోహనకృష్ణ ద్వారా చక్రవర్తి, డి. రామారావు, వి. సుబ్రహ్మణ్యం ఉన్నారు.



విశాఖ పౌర గ్రంథాలయంలో గిడుగు జయంతి సెప్టెంబర్ 8న 'గరిమ సాంస్కృతిక వేదికపై కవి అనంతరావుకు సాహితీ పురస్కారం జరిగింది. ప్రజ స్పందన అధ్యక్షులు సి.ఎస్.రావు, ఎమ్మెల్సీ ఎమ్‌వివిఎస్ శర్మ, బాబీ వర్ధన్ పాల్గొన్నారు



ఆగష్టు 8న గుంటూరు బృందావన్ గార్డెన్స్‌లోని అన్నమయ్య కళావేదికపై రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ పురస్కార గ్రహీత కొణతం నాగేశ్వరరావు స్వరపరచి గానం చేసిన, **6** నుండి **10**వ తరగతి విద్యార్థులకు ఉపాధ్యాయులకు ఉపయుక్తమైన 'తెలుగు పద్య సుధానిధి-2' ఆడియో సి.డి.ని ఆవిష్కరిస్తున్న గుంటూరు డి.ఇ.ఓ. డి. ఆంజనేయులు, కృష్ణా గుంటూరు జిల్లాల ఉపాధ్యాయ యం. యల్.సి కె.యస్. లక్ష్మణరావు ప్రభృతులు. చిత్రంలో (ఎడమ నుండి కుడి) సి.డి. రూపకర్త కొణతం నాగేశ్వరరావు, గుంటూరు డి.ఇ.ఓ. డి. ఆంజనేయులు, యం.యల్.సి.కె.యస్. లక్ష్మణరావు, డా. దేవరపల్లి ప్రభుదాసు తుర్లపాటి రాధాకృష్ణమూర్తి, ప్రముఖ రచయిత్రి ఎ.వి.కె. సుజాత.

## దాట్ల దేవదానం రాజు, మంత్రి కృష్ణమోహన్‌లకు గుంటూరు జిల్లా రచయితల సంఘం సాహిత్య పురస్కారాలు



దాట్ల దేవదానం రాజు

గుంటూరు జిల్లా రచయితల సంఘం 2012 సంవత్సరానికి గాను కథ, కవితా ప్రక్రియల్లో పురస్కారాలను ప్రకటించింది. కథ ప్రక్రియలో "యానాం కథలు" రాసిన దాట్ల దేవదానం రాజుకు, కవితా ప్రక్రియలో "ప్రవహించే పాదాలు" కవితా సంపుటి వెలువరించిన మంత్రి కృష్ణమోహన్‌కు ఈ పురస్కారాలు అందజేస్తున్నట్లు ఒక ప్రకటనలో తెలిపారు. ఈ ఎంపికకు పాపినేని శివశంకర్, పెనుగొండ లక్ష్మీనారాయణలున్యాయ నిర్ణేతగా వ్యవహరించినట్లు తెలిపారు.

## కరుణ రసాత్మకత కథలకు ఆహ్వానం

కరుణరసంతో కూడిన కథలను పంపించవలసిందిగా శ్రీలేఖ సాహితీ అధ్యక్షులు డా. టి. శ్రీరంగస్వామి ఒక ప్రకటనలో కోరారు. ప్రత్యేక గ్రంథం ప్రచురించనున్నట్లు తెలిపారు. అక్టోబరు 31 లోపుగా పల్లెసీమ, విశ్రాంత తెలుగు అధ్యాపకులు, ఇం.నం : **2-1-14 సరస్వతినగర్, గోపాలపురం రోడ్, విద్యారణ్యపురి, హన్మకొండ - 506009 చిరునామకు పంపాలి. ఇతర వివరాలకు 9848380473 ద్వారా సంప్రదించగలరు.**

## చిన్న కథలకు 'సోమేపల్లి' పురస్కారాలు

సోమేపల్లి హనుమంతరావుగారి స్మృత్యర్థం సాహితీపురస్కారాలు ఇవ్వాలని నిర్ణయించినట్లు సోమేపల్లి వెంకట సుబ్బయ, చలపాక ప్రకాశ్‌లు సంయుక్త ప్రకటనలో తెలిపారు. రమ్యభారతి సహకారంతో జరిగే ఈ కథల పోటీకి కథలను అక్టోబర్ 30వ తేదీలోపు రమ్యభారతి, పి.బి.నెం.5, 11-57/1-32, జె.ఆర్.కాంప్లెక్స్, రెండవ అంతస్తు, రజక వీధి, విజయవాడ - 520001 (సెల్ : 9247475975) అనే చిరునామాకు పంపాలి.

## వేంపల్లి షరీఫ్ మల్లిపురం జగదీష్ లకు 2013 విమలాశాంతి సాహిత్య పురస్కారాలు

'2013 శాంతి రజనీకాంత్ స్మారక కథాపురస్కారాన్ని' వేంపల్లి షరీఫ్ (కడప జిల్లా) "జుమ్మా" అనే కథా సంపుటికి, మల్లిపురం జగదీష్ (శ్రీకాకుళం జిల్లా) 'శిలకోల' అనే కథా సంపుటికి సంయుక్తంగా అందజేస్తున్నట్టు డా. శాంతి నారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పోటీకి 43 గురు రచయితలు తమ కథా సంపుటాలను పంపారని తెలిపారు. అక్టోబర్ నెలలో జరిగే పురస్కార ప్రధానోత్సవ సభలో రచయితలకు జ్ఞాపికలతో పాటు ఒక్కొక్కరికి రూ. 5000/-ల చొప్పున నగదును అందజేస్తామని తెలిపారు. ఈ పురస్కారాల ఎంపికలో ఆచార్య కాత్యాయని విద్మహే, గంటేడు గౌరునాయుడు, డా॥ వి.ఆర్. రాసాని న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించినట్లు తెలిపారు.

## మౌనశ్రీ మల్లిక్‌కు డా. రాధేయ కవితా పురస్కారం

డా. రాధేయ కవితా పురస్కారం 2013ను 'మిథునం చూడని సూర్యోదయం" అనే కవితను వ్రాసిన మౌనశ్రీ మల్లిక్‌కు అందజేస్తున్నట్లు అవార్డు వ్యవస్థాపకులు దొర్నాదుల సిద్ధార్థ, సుంకర గోపాలయ్య, పెళ్ళూరు సునీల్ ఒక ప్రకటనలో తెలిపారు. రెండు ప్రత్యేక పురస్కారాల కోసం ఎం.వి. రామిరెడ్డి, కొత్తపల్లి సురేష్‌లను ఎంపిక చేసినట్లు తెలిపారు. త్వరలో జరగబోయే ఒక కార్యక్రమంలో బహుమతి ప్రధానం జరుగుతుందని ఆ ప్రకటనలో తెలియజేశారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**













# బంగారు తల్లి

మా ఇంటి మహాలక్ష్మి

## ఆడపిల్లకు ప్రతి ఏటా ప్రభుత్వ సాయం.
## బంగారు తల్లులు
## అవుతారు తల్లిదండ్రులకు వరం.







| బంగారు తల్లి | | |
|---|---|---|
| [illegible]య్సు | దశ | మొత్తం (రూ.) |
| [illegible] | జనన నమోదు సమయంలో | 2,500 |
| [illegible] 2వ సం॥ల వరకు | టీకాల నిమిత్తము | సం॥నికి 1,000 |
| 3 నుండి 5వ సం॥ల వరకు | అంగన్‌వాడి | సం॥నికి 1,500 |
| 6 నుండి 10వ సం॥ల వరకు | 1 నుండి 5వ తరగతి వరకు | సం॥నికి 2,000 |
| 11 నుండి 13వ సం॥ల వరకు | 6 నుండి 8వ తరగతి వరకు | సం॥నికి 2,500 |
| 14 నుండి 15వ సం॥ల వరకు | 9 నుండి 10వ తరగతి వరకు | సం॥నికి 3,000 |
| 16 నుండి 17వ సం॥ల వరకు | 11 నుండి 12వ తరగతి వరకు | సం॥నికి 3,500 |
| 18 నుండి 21వ సం॥ల వరకు | గ్రాడ్యుయేషన్ - 1 నుండి 4వ సం॥ల వరకు | సం॥నికి 4,000 |
| 18 సం॥లకు - ఇంటర్‌మీడియెట్ తరువాత రూ. 50,000, గ్రాడ్యుయేషన్ తరువాత రూ. 1 లక్ష | | |

**మొత్తం రూ.2,16,000**

## ఆడపిల్లల ఉజ్వల భవిషత్తుకు ప్రభుత్వ భరోసా

ఆడపిల్ల పుట్టినప్పుడు, ఇంటికి లక్ష్మీదేవి వచ్చిందంటారు. దురదృష్టవశాత్తు ఇది మాటలకే పరిమితమైపోయింది. ఆడపిల్ల జననం కుటుంబానికే భారమని తల్లిదండ్రులు భాదపడుతుంటారు. ఈ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ముఖ్యమంత్రి శ్రీ నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి నాయకత్వంలోని మన రాష్ట్ర ప్రభుత్వం **"బంగారు తల్లి"** పథకం తీసుకొచ్చింది.

ఈ పథకం కింద ఆడపిల్ల జననం నుండి డిగ్రీ వరకు ప్రభుత్వం ఏడాదికి కొంత మొత్తాన్ని అందిస్తుంది - మొత్తం రూ.2,16,000 లు అందజేస్తుంది. ఆడపిల్లల కొరకు ఇప్పటికే ప్రభుత్వం అమలు చేస్తున్న పథకాలకు అదనంగా, ఈ పథకం రాష్ట్రంలోని తెల్లకార్డుదారులందరికి వర్తిస్తుంది!



**గా॥ శ్రీమతి సునీతా లక్ష్మారెడ్డి**
ఇందిరాక్రాంతి పథం, పెన్షన్లు,
స్వయం సహాయక గ్రూపులు,
మహిళా, శిశు సంక్షేమ శాఖామాత్యులు



**శ్రీమతి డి. కె. అరుణ**
సమాచార, పౌర సంబంధాల
శాఖామాత్యులు





జారీ చేసినవారు: సమాచార, పౌర సంబంధాల శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

PRSVM02A154



50

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | PRSVM02A154 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | KDaveed |
| పేజీలు విడదీసినది | KDaveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యునిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |